ఘనముగ నిను సేవించు చుంద్రు మనులు బహుగొప్పగాను
నిరుపేదలు నీదు నామస్మరణ సేయుచుంద్రు నిర్మల మనసు తోడ
సేవల గైకొన్న నీవు చిద్విలాసములు జూపించుట లేదే
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 75

ఛత్రముబట్టి నూరేగుచుందువు యుత్సవ బ్రహ్మోత్సవాములందు
శంఖ చక్రములతో నాశీర్వదింపవే నాల్గు దిక్కులందు జనుల
దిక్కులు పిక్కటిల్ల గోవింద నామంబు మ్రోగదే కొండలు
ప్రతిధ్వనింప
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 76

జనయిత నీవే జనయిత్రియు నీవే సర్వ జన రక్షకుండవు నీవె
జగముల నేలెడి జగన్నాటక సూత్రధారియు నీవే నిక్కముగను
శంఖ చక్రధారియైన జగన్నాధుడవు నీవనినమ్ముచుంటి నేను
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 77

ఝరముల తీర్థంబు జల జల మని జారుచు నుండు పవిత్ర
పుష్కరణీ యందు
గోవింద గోవింద యనుచు మునుగుచుంద్రు గుడుగుడుమంచు పాప
పరి హారంబు నకున్
పవిత్ర పుష్కరణీ జలంబు భక్తుల పాలిటి దివ్యౌషధంబు గాదె
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 78

టెంకాయలు బగులుచు నుండు నీదు ముంగిట తెల్లవార్లు
భక్తుల శేఉదనంబు తెల్లమగుచునుండు నీదు ముంగిట నిజముగాను
సత్యమౌ నీదు సన్నిధి భక్తుల పాలిట పెన్నిధి గాదె
శ్రీశేషశైలవాస శ్రీ కల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 79

తావులు దప్పియుంటి నేనిచట రీవిగ నుంటివి నీవు కొంత సేవ
కొండదేవుడైన కోదండరాముడవు నీవ నేగొల్చుచుంటి శక్తి మీర
రావుల్ దప్ప నీయక గరువిప్పించెదవు గదయ్యా గన్నతుల జేయు
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 80

డాపల భాగమందు ధరించితివి గదయ్యా శంఖమును
సింహనాదము సేయ
దక్షిణ భాగనుందుంచెదవు చక్రమున్ శిష్టరక్షణ జేయ
శంఖు చక్రములన్ గల్గిననీవు నామాల సామివైతివి గదయ్యా
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 81

ఢంకా బజాయించి జెప్పుకొనరె నిత్య సత్యములైన నీదు మహిమలన్
ఢక్కా ముక్కలు దినుచు నీదు దర్శనంబు జేసుకొనరె నిర్మల
మనసుతోడ
ఢమ ఢమ ధ్వనులు మ్రోగుచుండ ప్రతిధ్వనింప దే నీదునామాలకొండ
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 82

తొలుదొల్త నిను జూడ దెలిపి కొంటినయ్యా నీవు వనాద్యుడవని
మలి సారి నిను గాంచి మురిసి పోతినయ్యా నీదు మహిమ జూచి
ఎన్ని మార్లు నిను దర్శించిన గాని నెమ్మదింపగదేం నాదుమనము
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 83

దినకరుని కిరణముల్ సోక ధగధగ మెరయు చుండు రథసప్తమి నాడు
నీదు యాభరణంబులు ఈశాన్య దిశ యందు గరుడ విందుగాను
చంద్రప్రభపైనున్న యాభరణములు జిగేల్ మనిపించవె
వెన్నెలలు కురియు నాడు
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 84

ధన రాసులతో నీదు కోశాగారములు నిండుచుండె ధరిత్రినేడు
వేదఘోషలు వినిపించుచుండె విశ్వవంతయు నేడు వింతగాను
వేదశాస్త్రములన్ విలసిల్లుచుండె విశ్వవిద్యాలయంబులందు నీదు రుణ
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 85

నేతవు నీవే యధినేతవు నీవే విశ్వనేతవు నీవే నివ్వెరపడ జనులు
నూలు పోగులు మేమైన నేతగాడవు నీవు గాదె నిజము గాను
నడుమ నడుమ నుండు పడుగుల ముడుల విప్పి నేలుమయ్య మమ్ము
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 86

ప్రభాత నమస్కృతుల్ జేకొనుమయ్యా సుప్రభాతంబు నీకు
ప్రవాహంబుల్ సంద్రునిజేరు పగిది విజభక్తుల్ నిను జేరకుందురే
ప్రతియొక్కరిన్ జన్మరాహిత్యంబు నకు పావన మానవ జన్మ
కారణంబుగా దె
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 87

ఫలించకుండునటయ్యా ప్రదక్షిణములన్ భక్తితో సలుప కార్యములన్
ఫలితంబు గావించ కుందురే భక్తి ప్రపత్తులన్ నిను ప్రస్తుతింప
ఫలిత మాశింపక నిను సేవింప బహువిధముల నాశీర్వదింపవటయ్యా
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 88

బుద్బుద ప్రాయమైన మానవ జన్మయందు యాశలతో పరితపించరే
జనులు
ఆశావిరాశల నడుమ నల్లల్లాడుచునుందురే నధిగమించ లేక
క్షణకాలము మనసాధనిన్ దల్ప తక్షణమేకార్యముల్ నెరవేరవటయ్యా
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 89

భక్తాభీష్టదవీవె భక్తవత్సలుడవీవె భగవత్స్వరూపుడవు నీవు గాదె
భక్తుల గోర్కెల నెరవేర్చ బహు విధంబుల ప్రస్తుతింప
బడుచుంటివి గాదె
భక్తుల ముక్తికి సోపానంబు నీదు మొదటి సోపానంబుగాదె నిజముగాను
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 90

మనమున నిన్ దలచి మదిన్ నిన్ నిల్పి మనసార నిన్ దలప
నమస్కరించి నమస్కరించి హృదయాంతరాళంబు నందు నిన్ నిల్పి
పరుగు పరుగున రావటయ్యా నీవు నీదు భక్తుల యాదుకొనగ
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 91

యజుర్వేదాది శాఖలున్ చెప్పబడుచుండు నీదు చెంత నిశ్చితముగాను
యజ్ఞ యాగాది క్రతువులున్ నిర్వహించ బడుచుండు నిర్మలమునన్
నిత్యాగ్నిహోత్రముల్ జరుప యాయురారోగ్యముల్ ప్రసాదింపవటయ్యా
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 92

రంగవల్లుల తీర్చింప బడుచుండు నీదు ముంగిళ్ళ యందు నిశ్చల
భక్తితోడ
రంగు రంగుల విద్యుత్కాంతులు విరాజిల్లుచునుండు నీదు
గోపురములందు కడు నిండుగాను
రంగ రంగ వైభవంబుగ నిత్యకళ్యాణము పచ్చతోరణమై
విలసిల్లదే నీదు కొండ
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 93

లలిత లలిత మధుర శ్రీకరంబు శ్రీవారి పాదరేణువు గాదె
మధుర మధుర దివ్యానుభూతి గల్గించునది శ్రీవారి పంచాభిషేకంబుగాదె
ఇలలోన సర్వపాపముల నివారణకు కారణంబు శ్రీవారితీర్థజలంబుగాదె
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 94

వ్రజకిరీటంబు ధరింపితివి గదయ్యా విశ్వ కల్యాణంబు కొరకునేడు
వటపత్రశాయి వైన యీవు కారణాంతరంబున వకుళకు మురుడవు గాదె
కలియుగాన
భక్తబావాజీతో చదరంగమాడవే భక్తుల శక్తియుక్తులన్ దెలుప
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపు ష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 95

శరణు శరణు శ్రీవెంకటేశా శరణు శరణు
శరణమయ్యా నీదు పవిత్ర పాదారవిందములకు శరణు శరణు
శరణు జొచ్చిన మమ్ము వతతమ్ము గాపాడ రావటయ్యా నీవు
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 96

షరాబైన గానీ గతిబైన గానీ సాహాసింపరే నీదు దర్శనంబు సేయ
షట్కర్మలన్ జేయు పండితప్రకాండులున్ పంతసంబున నీదుసేవల్
జేయ
షికాయనకొచ్చు పకీరులల్ నిను దర్శింప నిర్భాంత పడరటయ్యా
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 97

సంకటములు దొలగించు స్వామివి నీవని సేవింపరే నిను భక్తిన్
సంతతము నిన్ యి యిాలన్ సేవింప భాగ్యమబ్బునే ఏల్లవారికిన్
సందడి యుండు నీదుముంగిళ్ళ దినరాత్రముల్ భక్త బృందములతో
నిండియుండ వటయ్యా
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 98

హాతీరాం బావాజీతో యాడవే పాచికలు యంతుతీక
ఆశా నిరాశల నడుమ భక్తుల యాదరింపవే నాత్రముగను
యబ్బురంబుగ నీమహిమల్ జెప్ప కొసంటయ్యా ధరిత్రిని నిర్భరంముగ
శ్రీశేషశైలవాస శ్రీ కల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 99

క్షీరాబ్ధి నుండి కదలి రావె కలియుగాన భక్తసంరక్షణ కొఱకు
క్షీరసాగరము వదలి రావె యశోద యాకాంక్ష మేరకు
పాలసంద్రము నుండి పరుగున తరలి రావె శ్రీవెంకటాచలమునకు
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 100

క్షణ క్షణమున్ నిన్ మదిన్ దల్చరే పాపప్రక్షాళనంబు సేయ
క్షాళనంబు గావించ కొనరె పాపంబుల క్షేమంబు కొరకు
క్షేత్రజ్ఞుండవైన నీవు నీదుక్షేత్రంబు జేర క్షేమకరుడవై
కాపాడరావటయ్యా
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 101

జివ్వ జివ్వన వ్రాలరటయ్యా జనుల్ జిచ్చపడగ నీదువాకిళ్ళ ముందు
తెప్పపాటు దర్శన మాత్రాన జిచ్చపడరె భక్తులు నీదు మహిమ
బంపిల్లు మండరే నీదు ప్రతిభ జాతి గుండెల కరగ జేయ కలియుగాన
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 102

జివ్వ జివ్వన జేరుచునుండవె తెమ్మలు నీదు పాదముల నంకరింప
రెప్పపాటున నీదు దివ్యమోహన రూపమున్ గాన కుందురే గన్నులార
బంతిల్లు మండవే నీదువాకిళ్ళ ముంగిళ్ళ చూడ ముచ్చట గను
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 103

శ్రీకరుండవై విలసిల్లుచుంటివి శ్రీవేంకటాచలమున సిరులుప్పొంగగ
శ్రీవేంకటేశ్వరుడవై విరాజిల్లుచుంటివి శ్రీవేంకటాచలమున
కలియుగాన
శ్రీశ్రీనివాసుడవై వెలుగొందుచుంటివి గాదె సరినిత్యనూతన వరుడవై
శ్రీశేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీవెంకటేశా 104

శ్రీకరంబై వెలుగొందు చుండె శ్రీవేంకటాచలము నేడు నీదుమహిమ
శ్రీవారి కరుణా కిరణములు ప్రసరింపవే భక్తుల హృదయ సీమయందు
శ్రీహరి కరుణా కటాక్షణంబులు ప్రసరింపవె వైకుంఠము నుండి
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 105

శ్రీఖండమున్ బూయరే స్వామికి విశ్రాంతి సమయమందు శాంతినొంద
శ్రీచూర్ణమున్ దిద్దరే స్వామికి "శ్రీ శ్రీనివాసా" యంచు నగుమోముతోడ
శ్రీమంతుడై విరాజిల్లదే స్వామి భక్తుల సేవలందుకొనుచు
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 106

శ్రీ శేషశైలము పైవసించు శ్రీశేషాచలపతివి నీవు గాదె
శ్రీగరుడాచలముపై నివసించు గరుడాధిపతియు నీవుగాదె
శ్రీ వెంకటాద్రి వాసుడవైన శ్రీ వేంకటేశ్వరుడవు నీవుగాదె
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 107

శ్రీనారాయణాద్రిని నిలయంబుగాజేసుకొన్న నత నారాయణుండవు
నీవు గాదె
శ్రీవృషభాద్రి వృషాద్రులయందు వాసమున్న వాసుదేవుడవు నీవుగాదె
శ్రీ వేంకటాచలమున విలసిల్లుచుండు శ్రీ వేంకటాచలపతివి నీవు గాదె
శ్రీ శేషశైలవాస శ్రీకల్కిపురుష ఏడుకొండలవాడ శ్రీ వెంకటేశా 108

చిలనా శాస్త్రియను చిన్న వాడనుయేను
పండిత జ్ఞానంబు లేని పామరుడను
విన్న వించు కొంటినయ్య నాదు యనుభవంబు భక్తితోడ
చేకొనుమయ్య కృతినీవింక చేరదీసి శ్రీ వేంకటేశా! "



ఓం శ్రీ సూర్యసిద్ధి విఘ్నేశ్వరాయనమః
ఓం శ్రీ సూర్య వినాయకాయ నమః
ఓం శ్రీ సూర్య గణపతయే నమః
ఓం శ్రీ సూర్య మహాగణపతయే నమః

# అలమేలు మంగ శతకము

## రచనః— శతక కవి చి॥ల॥నా॥శాస్త్రి

శ్రీపతి సతి యైన సిరి భూమి దేవికి
చేతులెత్తి గొలువ సిరియు గలుగు
సిరులు గలుగు కతన సిరి లచ్చియును, గాదే!
తలపగ నలమేల దివిని దీరు! 1

అటులనేల జూడ యశము గల్గదె
నిటను వేంకటపతి నికను గనగ
కర్మ దొలగి పోవు కాల గమనమున
తలపగ నల వేల దనివి దీరు 2

ఆకన,దరణులకు నాశయు కల్గగ
సంతు కొరకు మిగుల సంతసమున
యజ్ఞ మికను జేయ యిష్టము గాదొకో
తలపగ నలవేల దనివి దీరు! 3

యజ్ఞ భూమియందు యాజ్ఞికు లరుదెంచ
వేద ఘోష లింక వినబడ నిక
ధరణి పతియు యజ్ఞ ధరణిని దున్నుచుండ
తలపగ నలవేల దనివి దీరు! 4

కొంత దవ్వు దున్న కోండ్రయు నిలువదే!
ఏమి వింత యనుచు యెంచి జూడ
తవ్వి చూడ నటను తగులగ నొకపెట్టె!
తలపగ నలవేల దనివి దీరు! 5

పెట్టె తెరచి జూడ పెద్దలందరు నిక
పాప నింక గనరే పండు వోలె!
ధరణి యంతయు మురియ ధరణి పతిని గూడి
తలపగ నలవేల దనివి దీరు! 6

'పద్మవతి' యనియును పాపకు పేరిడ
బూల వాన కురిసె పుడమి యందు
పుడమి ప్రజలు పులకింప మిగులుగ
తలపగ నలవేల దనివి దీరు! 7

ధరణి మోద మంది ధన్యత జెందదే
తనదు జన్మ గూడ ధన్య మయ్యె
ననుచు తలచి తరచి నాత్మ సంతృప్తితో
తలపగ నలవేల దనివి దీరు! 8

జనకునకును 'సీత' జాడ తెలిసినట్లు
ధరణి పతికి 'పద్మ' ధరణి యందు
నల్లె దొరకెనంచు నానంద మొందగ
తలపగ నలవేల దనివి దీరు! 9

లక్ష్మి వృధి వ్రొచ్చె లక్షణముగ ననుచు
మునులు పండితులును ముచ్చటింప
'ధరణి' ధరణిపతులి ధన్యులు గారొకో
తలపగ నలవేల దనివి దీరు! 10

పాప దొరికె మంచి ఫలితమోయనునట్లు
ధరణి జన్మ నిచ్చె తనయునకును
మురిసి పోదే నింక ముద్దులాడుచు నిక
తలపగ నలవేల దనివి దీరు! 11

పద్మ, వసుధనులును పారిణతనుబొంద
పెరుగ పెరుగ పద్మ పెద్దదయ్యె రగ
వనములో నూడ వెంకన్న అతిథియయ్యె
తలవగ నలవేల దనివి దీరు! 12

వేంకటేశు డటకు వేగిరముగ రాగ
హస్తిని దరుముచును నాశ్రమము గను
గజము జేరె యటకు గతియును దప్పియు
తలపగ నలవేల దనివి దీరు! 13

చెలులు జూసినంత చెంగున మరలెడి
పద్మ పైన ప్రేమ పెంచు కొనియు
వేంకటపతి తిరిగి వెడలె వేదన తోడ
తలపగ నలవేల దనివి దీరు! 14

వీట మిషను వెడలె వేంకటనాథుడు
కొండ దిగడె నిజము కోర్కె దీర
మాయ మనదె దంతి! మర్మము దెలుపగ
తలపగ నలవే దనివి దీరు! 15

వకుళరాల యడుగ వగపు కతనమును
వేంకటేశు దెల్పె విరహము నను
పెండ్లి సేయ గోరె పద్మవతి నికను
తలపగ నలవేల దనివి దీరు! 16

పరితపించనేల పద్మవతిని గూర్చి
శ్రీనివాస దెల్పు చింత దీర్తు
యాడుచు వకుళయడుగ యటులనె దెల్పగ
తలపగ నలవే దనివి దీరు! 17

త్రేతయుగము నుండి తప సివాసి యొకడు
తపసి వాక్కు వాంవ దొరకలె శిశువు
వేద ఘోష పల్ల వేదపతియు గాదె
తలపగ నలవేల దనివి దీరు! 18

తపసి యాగ తోడ తపమున కేగదె
వేదవతియు మిగుల వేడ్కతోడ
శ్రీహరినినే పెండ్లి చేసు కొన దలచి
తలపగ నలవేల దనివి దీరు! 19

తపము చేత వేద తరియింప మిగులుగ
'రావణుండు' జూసి 'రాణి' వగుమ
యనుచు మదము తోడ అరుపడె రొప్పుచు
తలపగ నలవేల దనివి దీరు! 20

వేదవతియు గూడ వేద వాక్కులు చెప్ప
పెడగ చెవిని బెట్టి పెంకి ఘటము
ఎవరి కర్మల కెవరెవరు కాకర్తలు
తలపగ నలవేల దనివి దీరు! 21

వేద బిల్వ యగ్ని వేగ రాగ యటకు
శోక రావణుండు తనువు బాసె
శాప మిచ్చినంత చింతలో మరలగ
తలపగ నలవేల దనివి దీరు 22

రాముడవతరించె రావణుని దునుమ
దశరధ తనయుడుగ ధరణి వెలసె
వాసముండె గాదె వనముల యందున
తలపగ నలవేల దనివి దీరు! 23

సీత లక్ష్మణులతో సంతస ముండఁడె
కాననముల లోన కటినముగను
శూర్పణఖయు జూడ సుకరము వలె నుండ
తలపగ నలవేల దనివి దీరు! 24

రావణుండు దెలిసె రాముని సతి సీత
యనియు చెరనుబట్ట యభిలషించి
భిక్షు వేషమునను పిక్కడె వేగమె
తలపగ నలవేల దనివి దీరు! 25

అగ్ని దేవు దెల్ప యా వేదవతి కిని
రావణునిక జంప అంకి వేయ
సీత బదులు గడుప చింతయు దీరగ
తలపగ నలవేల దనివి దీరు! 26

అగ్ని దేవు డంత యాతని బిల్వగ
రావణుండు 'మరల'! రావణేశ!
సీత యిదిగో నిచట! సిద్ధముగ నికను
తలపగ నలవేల దనివి దీరు! 27

"నిజము సీత" యాపె నిక్కముగా నిక
సురలు దాచి యుంచె సుదతి నిచట
లోకమందు మాయ లోతుగ దెలియర
తలపగ నలవేల దనివి దీరు! 28

రాముఁ డవతరించె రఘు వంశ మందున
రావణు నిక జంప రణము నందు
రామ రాజ్యమేల శక్తిఁగ నింకను
తలపగ నలవేల దనివి దీరు! 29

త్యాగ బుద్ధి చేత తరియింపవేనిక
పరమ పావనుండు పరరిశింప
వేదనేల నమ్మ వేదవతియు నీకు
తలపగ నలవేల దనివి దీరు! 30

కోపమొచ్చు ననియు కోరి తెచ్చితినయ్య
మానపోవ యీవు మొట్ట మొదట
"నిగము సీత" యిదిగొ నమ్మ మనగ యగ్ని
తలపగ నలవేల దనివి దీరు! 31

అగ్ని దేవుడియ యందు కొనడె వేద
వతిని 'నిజము సీత' వచ్చినంత
'స్వాహా' దేవి కిచ్చె జాగ్రత్త పడపగ
తలపగ నలవేల దనివి దీరు! 32

వనము నందు రాము వాసము జేయడె
లక్ష్మణుని గలసియు లంపటముగ
వానరముల తోడ వనగూడి యుండగ
తలపగ నలవేల దనివి దీరు! 33

తోక మూక తోడ తొలుత నుపాగించె
రణము సాగుచుండె రణము 'శగల'
రాము తుదకు దునిమె రావణాథముల
తలపగ నలవేల దనివి దీరు! 34

రాము విభీషణునకు రాజ్యము నిచ్చియు
పట్టమంచు గట్టె పట్టుదలతో
వేదవతిని వేగ వేగమె 'విభీషణు'
తలపగ నలవేల దనివి దీరు! 35

చింత జెందె లఖను చితిని పేర్చగ నిక
రాము నాజ్ఞ నైన రణము పిదప
మూంచు సీత వచ్చె మర్మము లేకను
తలపగ నలవే దనివి దీరు! 36

వేదవతియు దునింకె వేగమె చితియందు
'రాము' యాన చేత రమణి యింక
యగ్ని జేర్చె పైకి యా సీత నిర్వర
తలపగ నలవేల దనివి దీరు! 37

పైకి వచ్చినంత పలికె 'నిజము సీత'
'త్యాగశీలి వేద తప్పక గొనుము!
సమ్మతింతు రాము! సంబరమున నేను
తలపగ నలవే దనివి దీరు! 38

వినగ రాము సీత విన్నపము మిగుల
నిర్ణయంబు దెలిపె నిర్మలముగ
యేక పత్నీ వ్రతుడు యేను యీ యుగమున
తలపగ నలవేల దనివి దీరు! 39

'వెంకటేశు' నిగను వెలసి యుండెద యేను
"నీద" పద్మవతిగ వెల్లివిరియు
తల్లి "వకుళ" జేయు తప్పక బెండ్లియు
తలపగ నలవేల దనివి దీరు! 40

పూర్వ కథను దెలుప పొందుగ వకుళకు
సంత సించె వకుళ సంద్ర మంత
మాయ దారి!! నీకు మనువు జేయుట యెంత
తలపగ నలవేల దనివి దీరు! 41

వేంకటేశు డిదిగ వెలసూవె బుట్టను
మాతగాను యుండ మాల గోరి
కోరికలను దీర్చి కొరత లేకనూ జేసె!
తలపగ నలవేల దనివి దీరు! 42

పద్మవతిని మిగుల పలుకరించె విధిని
చెలులు గొట్టె రాళ్ళ చేత! దరుమ
యెట్లు మరుతు నమ్మ యేనింక పద్మవతిని!
తలపగ నలవేల దనివి దీరు! 43

నరయ బెరుగు చుండె నారాయణ వనము
నందు, పూర్వ కృతము నన్ను గలసి
'ధరణి' యాకను లకు తనయగాని తనయ
తలపగ నలవే దనివి దీరు! 44

'వకుళ' నవ్వు మోము పెట్టి చివంపదే
నిటుల వేంకటేశుని గని యెదుట
కపట వేషధారి కలియుగ రూపుడ
తలపగ నలవే దనివి దీరు! 45

పాలకడలి వీడి పాము పుట్టను జేరి
వేంకటాచలమును వెలయ జేరె!
వెంకటేశ! యంచు వేడెద దరిజూపు
తలపగ నలవేల దనివి దీరు! 46

దారి దెలుపు దేవ! తప్పక యింకనూ,
పోయి వచ్చినంత పొందు గుదురు
నీకు పెండ్లి సేయ నిశ్చయించితి నయ్య
తలపగ నలవేల దనివి దీరు! 47

'కపిల' మునిని మొదట గనినంత మాత్రాన
దారి దెలియు నమ్మ! తప్పకుండ
నడక దూరమమ్మ! "నారాయణ వనము"
తలపగ నలవేల దనివి దీరు! 48

వకుళ బరులు దేరే వనమాలి నురుపున
కపిలేశ్వరునిక గనిన యంత
తోడు దొరికె నంచు తృప్తిని జెందగ
తలపగ నలవేల దనివి దీరు 49

పాచికలను నొక్క వట్టు దండంబును
నొక్క చేతబట్టి నోరు యూర
బిలచె 'సోది' యంచు బెద్దగ పురమున
తలపగ నలవేల దనివి దీరు। 50

మూర్ఛ జెందె నద్ది! ముందుగ నిగులంగ
శ్రీనివాస నిలువ చిత్రముగను
హృదయ సీమ యందు హృద్యమంబుగ వేగ
తలపగ నలవేల దనివి దీరు! 51

ధరణి చింత జెందె వారి తెన్నుయు లేక
వైద్యు లంత జూసి వెనుక తిరుగ
గాలి ధూళి యంచు గొందరు జెప్పగ
తలపగ నలవేల దనివి దీరు! 52

'సోది' యన్న మాట సోకగ చెవులకు
బిలచి నంత యామె బిర బిరమని
జేర, మణుల తోడ చేటను నింపగ
తలపగ నలవేల దివిని దీరు! 53

"పోది, పోది" యంచు పోఁడిమె జెప్పెద
వినుడు, నిజము మాట విశదము గను
కలత జెంద నేల గన్నులు జెదురగ
తలపగ నలవేల దనివి దీరు! 54

గాలి గాదు, ధూళి గాదు, శూన్యము గాదు
వ్యాకులత యేల వ్యాధి గాదు
మనసు యందు యున్న మానసికపు బాధ
తలపగ నలవేల దనివి దీరు! 55

పద్మ కోరి యున్న పడుచు వాడతడేగ
బ్రహ్మ యాది సురలు పంపెరతని
నీలమేఘుడతడు నిండు రూపు యతడె
తలపగ నలవేల దనివి దీరు! 56

వకుళ మాల వేసె వనరుగ వేమనము,
బ్రహ్మ దేవు నింక పావడి గను
జేసి, చంక గొనియు జేరగ చల్లగ
తలపగ నలవేల దనివి దీరు! 57

వకుళ, దరణి గలసి వచియించె విషయము
ప మ పురుషునకును పద్మ వతికి
పెండ్లి సేయ నెంచి బెద్దగా వచ్చితి
తలపగ నలవేల దనివి దీరు! 58

సూర్య వంశమునకు సూత్ర ధారియతఁడు
చంద్రవంశుఁడైన చారు దతఁడు
యాస్తి యడుగనింక యతఁడేగ యఖిలము
తలపగ నలవేల దనివి దీరు 59

దిక్కు తోచకింక తిరుగుచు ధరణియు,
కుల గురువుతో నింక కబురు పంప
నృపతి యెదుట వ్రాలె సుడుగు జేడాను వేగ
తలపగ నలవేల దనివి దీరు। 60

చేయి చూసి నంత చెప్పిన ఫలమును
ఎఱుక సాని దెల్పు ఎఱుక యొకటి
నమ్మ లేక యుంటి నాకు దారి దెలుపు'
తలపగ నలవేల దనివి దీరు! 61

నారదుండు దెలిపె నతి రహస్యంబును
పద్మవతికి యింక పట్టుగాను
లోకమాత యమ్మ లోకుల నమ్మకు
తలపగ నలవేల దనివి దీరు! 62

బ్రాహ్మణునిగ వచ్చి పద్మకు దెల్పగ
'లక్ష్మివి' గద నివు లక్షణముగ
పాలకడలి వాడు పరిణయ మాడఁడె
తలపగ నలవేల దనివిదీరు! 63

రాజ గురువు దెల్పె రాముడే యితడని
చిన్ని కృష్ణుడతడె సర్వ మతడె
యోంచి చూడ నరుడె యెరుగ గా శ్రీహరే
తలపగ నలవేల దనివి దీరు! 64

శుక మునీశ్వరుండు చూడగ వివరము
మంచి చెడులు దెలిపె మాట తోడ
శుక ముని నిక బిలువ జాగేల ధరణీశ!
తలపగ నలవేల దనివి దీరు! 65

‘తొండమాను’ బోయి తోడ్కొని రాగానే
శుకుడు దెలిపె నిటుల సూటిగాను
సురలు యంత రాగ జూడరే వాసుని
తలపగ నలవేల దనివి దీరు! 66

పూర్వ జన్మ కృతము పొందదె పద్మయు
యామ్మహా పురుషుడే యల్లుడవడె
పెండ్లి జరుపు మనగ పొందుగ నింకను
తలపగ నలవేల దనివి దీరు! 67

శుకుని చేత పంపె శుభ లేఖ నింపుగ
శ్రీనివాసునకును చింత దీర
వకుళ గూడ శుకుడు వెడలడె తోడుగ
తలపగ నలవేల దనివి దీరు! 68

శుకుని రాక జూసి శ్రీనివాసుడు పొంగ
ధర్మము ధరింప 'కాశి' యవత
రించితి నని యుబ్బురముగను దెల్పగ
తలపగ నలవేల దనివి దీరు! 69

వేంకటేశ! మనుజ వేష మేసితి వేల
కాగల పని యేమి గలదు నీకు
నావలనను యుంచు నవ్వుచు గోరగ
తలపగ నలవేల దనివి దీరు! 60

కార్యము ఫలమయ్యె కలత దొలగి పోవ
కనులు చెదరె నింక కొరత దీర
యతిథిగ నిట నుండి యాతిథ్యము గొనగ
తలపగ నలవేల దనివి దీరు! 71

శ్రీనివాసు బిలువ సురలందరు కేత
యాది శేషు దెల్ప యరుగ దెంచె
విష్ణు లోకులంత విసయంబు మీరగ
తలపగ నలవేల దనివి దీరు! 72

కొండ రాయు డప్పుగ గొననిక బదునారు
లక్ష రామ ముద్రల లక్షణముగ
ఐన బలుడీయ యా స్వామి బెండ్లికి
తలపగ నలవేల దనివి దీరు! 73

బ్రహ్మ శివులు సాక్షి భూతములుగ నుండ
నెలకు రామముద్ర నొక్కటిగను
వందకు సరి జూసి వడ్డిగ నీయగ
తలపగ నలవేల దనివి దీరు! 74

శివుడు ఒప్పుకొనియె సర్వుల పిలువంగ
యగ్ని నిలువ బడడె యన్ని చేయ
సుబ్రమణ్యు డొప్పె శుభలేక లంపగ
తలపగ నలవేల దనివి దీరు! 75

పరిమళముల జల్లె పవన రూపసుడను
ధర్మ రాజు యొప్పె ధర్మమునకు
మన్మథు మరియొప్పె మార్చ్చయానొక్కటి
తలపగ నలవేల దనివి దీరు! 76

ఏది లక్ష్మి యనుచు యెటనను గానక
ఎటుల జరుగునంచు 'యెంకటేశు'
తల్లడిల్లె నింక తలచుచు 'లక్ష్మిని'
తలపగ నలవేల దనివిదీరు! 77

బ్రహ్మ పలికె నిటుల బహు నిబ్బరంబుగ
సూర్య నంపు మయ్య సూటిగాను
యొడలు బాగు లేమి యొకసారి పిలువగ
తలపగ నలవేల దనివి దీరు! 78

మాయ వలన సూర్య! మచ్చయు లేకుండు
యుంచు నడువ నింక యాదిదేవు
రవియు సాగె వేగ రయమున బిలువగ
తలపగ నలవేల దనివి దీరు! 79

వార్త వినిన వెంట వగచుచు తరలదె
సూర్య దేవు వెంట చూడకుండ
యేమి బాధ దేవ! యెట్లి కంచు ననుచు
తలపగ నలవేల దనివి దీరు! 80

మాయ వీడినంత మాలచ్చికి దెలిసె
విషయ మెరిగి నంత 'పిదవతికి'
'సామి' తోడ పెండ్లి సాగునని దెలుప
తలపగ నలవేల దనివి దీరు! 81

పాద మొచ్చు ననుచు వేదన బడు చుండ
పెండ్లి మాట వినగ పరవశించె
జాగు యేల ననుచు 'జయము'ను దెలుపగ
తలపగ నలవేల దనివి దీరు! 82

బయలు దేరుడంచు బలుక తిరుమలేశు
మంగళాదులన్ని ముందు గాను
జరిపి విందు గుడిచి, చన నుడువగ బ్రహ్మ
తలపగ నలవేల దనివి దీరు! 83

ఆదిదేవునాజ్ఞ యగ్ని దేవుడమర్చు
వంటకంబు లన్ని వింతగాను
మరిక జేయ వెడలె మాగళ స్నానంబు
తలపగ నలవేల దనివి దీరు 84

నారసింహు నకును నైవేద్యమును బెట్ట
యాది దేవుడటుల యానతీయ
బ్రహ్మ దేవు బెట్టె భక్తితో స్వామికి
తలపగ నలవేల దనివి దీరు! 85

విందు గుడిచి నంత విశ్రమించి వెడలరె
సూర్య కిరణములు పోకగాన
'శుకు'ని యాశ్రమమును జూడరె సంధ్యకు
తలపగ నలవేల దనివి దీరు! 86

శుక మునియును గోరె స్వరద్రూపుని గాంచి
విందు గుడిచి కనుల విందు సేయ
'వకుళ' యాజ్ఞ మేర ఒప్పు కొనడె సామి
తలపగ నలవేల దనివి దీరు! 87

వేంకటేశు తినగ వేగిరయుంగ నిక
తినిన యట్లు మెచ్చి తిన్నగాను,
యతిథు లంత మెచ్చి యుబ్బురపడగను
తలపగ నలవేల దనివిదీరు! 88

విశ్రమించి యచట వేడ్క మీరంగనూ
తెల్ల వారి నంత లేమిలి యింక
నడువరె నిక జేసి నారాయణ వనమును
తలపగ నలవేల దనివి దీరు! 89

శ్రీనివాసు పెండ్లి చేసుకొను యనును
వార్త వినగ శుకుడు తెలుప వదన మింక
పొంగ! నగర మెల్ల పొందుగ నుంచడె
తలపగ నలవేల దనివి దీరు! 90

మంత్రములను దెచ్చి మచ్చట దీరగ
పండితములు వైచె బహుళముగను
పాదిగ రత్నములను పొందుగ నచ్చట
తలపగ నలవేల దనివి దీరు! 91

రథ, గజ, తురగముల రచ్చయు లేకను
జేసె, నాట్య మంద జేసె సొంపు
గాను, మేళ తాళ గానముల కళల
తలపగ నలవేల దనివిదీరు! 92

వంట గాండ్రు వచ్చె వరుస దిక్కుల నుండి
గంట వస్తు నిండె వనరు గాను
వేద విదులు రారె 'వేడుక' జరుపగ
తలపగ నలవేల దనివి దీరు! 93

'తొండమాను' డింక తోడుగ యుండగ
జూసె 'వసుధనుండు' చుక్కలంత
లెక్క తక్కలన్ని లెక్క లేకను యింక
తలపగ నలవేల దనివి దీరు! 94

కూతు వస్త్రములను కూరిమి నేయించె
యాభరణములన్ని యందజేసె
తాను, కొరత లేక తానె జూడడె రాజు
తలపగ నలవేల దనివి దీరు! 95

ముందుగాను పద్మ ముదముగ స్నానము
జేసినంత, పూజ సేసె కులపు
దేవతకును ముందు, దేదీప్యముగ నింక
తలపగ నలవేల దనివి దీరు! 96

పురిని పెండ్లి వారు పొందుగ జేరగా
'పద్మావతి'యు ముందు పట్టు పేర్గు
పైన కూర్చొనుగను పతిని ఎదురు బోరె
తలపగ నలవేల దనివి దీరు! 97

పద్మావతియు వెంక(ట) పతియు నింపుగ
మార్చు కొనరె మాల మరులు గొనగ
వేద ఘోష తోడ వేదిక జేరగ
తలపగ నలవేల దనివి దీరు! 98

సప్తఋషులు వచ్చి చదువంగ వేదముల్
బ్రహ్మ, వశులు యుండ బహుళముగను
మూడు ముళ్ళు వేసె ముచ్చట దీరగా
తలపగ నలవేల దనివి దీరు! 99

వేడుకలును జరిగె వైద్యు విహార బదియు
రెండు నాళ్ళు బహుళ రీతులనిక
యాకసుండు ఏడొ యందర కీనాడు
తలపగ నలవేల దనివి దీరు! 100

శ్రీనివాసుడుండ చిగురొత్తి పద్మతో
శ్రీనివాసునకును చింత దీరె
దేవతలును మెచ్చ దేవదేవుని దలచి
తలపగ నలవేల దనివి దీరు! 101

తిరుమలేశు దలుప, తిరుమలకును జోవ
గధ, గజ తురగములు రయము నంపె
పాడి, పశుల గూడ బంప యాకసుడను
తలపగ నలవేల దనివి దీరు! 102

కూతు తోడ నంపె కూర్మిని సంపద
తల్లి ధరణి దేవి తల్లడిల్లె
సోదరుండు కుంగ సోదరిని గనక
తలపగ నలవేల దనివి దీరు! 103

తొండమూను గూడ తూలుచు పడగను
పెండ్లి పిదప నింక పేర్మి తోడ
కూతు యుండ మిగుల కుశలమున పతిని
తలపగ నలవేల దనివి దీరు! 104

కూతు నంపె నింక కూరిమి తోడను
మెట్టి నింటి కింక మెరుగు బిడ్డ
పత్ని తోడ మిగుల పరవశ మొందగ
తలపగ నలవేల దనివి దీరు! 105

శ్రీనివాసుడుండె శ్రీయాగస్త్యాశ్రమ
మందు ముందుగాను! మరల మలకు
జనియె పద్మ గూడి చక చక నింకను
తలపగ నలవేల దనివి దీరు! 106

పంచమి దరిశనము బహు గొప్పగా దాకో
పంచమి దరిశనము బసుపు కుంకు
మకు లోటు లేక మురిక రక్షగ యుండ
తలపగ నలవేల దనివిదీరు! 107

పంచమి దినమునను బసుపు కుంకుమలకు
మంగపురము నందు యూరిక దెచ్చి
పూజ మాయు మవదె పారవు పూట ముడిక
తలపగ నలవేల దనివి దీరు! 108

మంగపురము నందు మహిమలు నగుకట్టు
కన్నులార గాంచ కార్తీక శుద్ధ
పంచమీ తిథినిక పవిత్రము గ తలచి
తలపగ నలవేల దనివి దీరు 109

రాసియుంటి నమ్మ రమణుని కృప తోడ
చేకొనుము కృతిని చేర దీసి
మనవనమ్మ న్నన్ను మరియింక నెపుడును
తలపగ నలవేల దనివి దీరు। 110

చిన్న మక్కన పురి చిన్న వాడను యేసు
కాదు శివుల ననుగు కన్నవాడు
లక్ష్మినారాయణగ లక్ష్యముగ నిలువగ
తలపగ నలవేల దనివి దీరు! 111

మంగ చరిత యింక మరి చదువగ నింక
మంగ యాశిసులును వనము కలుగు
మంగ మహిమ దెలియ మరి రాదె పున్నెము
తలపగ నలవేల దనివి దీరు! 112



ఓం శ్రీ సిద్ధి విఘ్నేశ్వరాయనమః

# శంకర శతకము

## రచన:– శతక కవి చి॥అ॥నా॥శాస్త్రి

శ్రీ శంకరుడవు నీవయె
శుభకరుడవు నీవు గాదె చోద్యము లేకన్
శరణము నీయవే మాకును
శంకర శంకర యనగను శరణము నీవే 1

అనుదినమును నిను తలువగ
యవనివి దిగులేల మాకు నాశయుదీరన్
ఖనియును నీవెగ గాచగ
శంకర శంకర యనగను శరణము నీవే 2

సంతసమున నుందువు గద
సహస్రమును జదువ ముదముగ సంవత్సరమున్
యొక వరియైనను నిండుగ
శంకర శంకర యనగను శరణము నీవే 3

అటు జూడగ నీవుందువు
ఇటు గాంచగ నీవులేవె యిలనేలుచుయున్
కాటిని గూడను యేలవే
శంకర శంకర యనగను శరణము నీవే 4

ఆయువు నీయవే మాకును
ఆయుర్దాయము గలుగగ యధినేతవివే
మృకండుని బ్రోవవె కరుణను
శంకర శంకర యనగను శరణము నీవే। 5

ఇలనిట జ్యోతిర్లింగము
లుగ వెలియవె వేఱు రూపుల మిగుల నింకన్
నిలువవె నదీ వదములను
శంకర శంకర యనగను శరణము నీవే। 6

ఈశ్వర నీవే పరమే
శ్వర నీవును గాదె కోరిసేవల జేయన్
కోర్కెల దీర్చవె కృపతో
శంకర శంకర యనగను శరణము నీవే। 7

ఉలి నిలిపెడి శిల నీవయె
యూతికి యుపకారి యీవే యిట భువియందున్
ఎటు జూపిన నీవుండవె
శంకర శంకర యనగను శరణము నీవే। 8

తాండవ నృత్యము జేయవె
మనమును నెమ్మది వరువగ మాలోకమునన్
పార్వతి తోడుగ నుండగ
శంకర శంకర యనగను శరణము నీవే। 9

ఈరూర నీవుందువు
లింగపు రూపును గలిగియు లోభావమునన్
లో భావము దెలియ శరమె
శంకర శంకర యనగను శరణము నీవే। 10

ఇటు నీళయె యటు నీవయె
ఎటునెటు జూసినను గాని ఎందున నీవే
కలలో గూడను నీవయె
శంకర శంకర యనగను శరణము నీవే। 11

ఋషులందరు నిను జేరగ
తపములు సేయరే దరిజేర తనివియు దీరన్
తృప్తిపడ వరము నీయవె
శంకర శంకర యనగను శరణము నీవే। 12

ఎచ్చోటను నీవుందువు
నీయానతి లేక చీమ నడుగిడ గలదె
సర్వాంతర్యా మగుటను
శంకర శంకర యనగను శరణము నీవే। 13

ఏచ్చోటను నీవున్నను
యచ్చోటనె మునులు ఋషులు యద్భుత సేవల్
జేయరే కానల నైనను
శంకర శంకర యనగను శరణము నీవే॥ 14

ఐనను కానీయ వయా
యెందరి కొరకు మతియుండ యుందగ నీవున్
కొరతెక్కడుందుగా నిక
శంకర శంకర యనగను శరణము నీవే॥ 15

ఒడుపుగ లింగము బట్టగ
మార్కండేయు నకును నికమూరిపెము తోడన్
నీయవె చిరాయు వింకను
శంకర శంకర యనగను శరణము నీవే॥ 16

ఓంకారాదుల మూలము
నీవయే ఓంకారములకు నుద్భవుడవుగా
ఓంకార మీవుగాదె
శంకర శంకర యనగను శరణము నీవే॥ 17

ఔదల దాల్చవె గంగను
యర్థశరీరము యుమకును యింపుగ యీయన్
సవతులు సఖ్యత నుండరే
శంకర శంకర యనగను శరణము నీవే॥ 18

'కాదు'యె వాసము నీకును
కనికరమయ నీహృదయము కొటిని యున్నన్
కరుణను వేడగ బ్రోవవె
శంకర శంకర యనగను శరణము నీవే॥ 19

ఖడ్గము లేకను యున్నను
త్రిశూలము ధరింపవె యిక త్రిజగము లేలన్
పార్వతి తోడుగ యుండగ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 20

గంగను విడువవె భూలో
కమునకును పవిత్రులవగ నిక కఠినాత్ములుయున్
పాపము బోవగ గొలువరే
శంకర శంకర యనగను శరణము నీవే॥ 21

ఘల్లు, ఘల్లు శబ్దములతో
తాండవ నృత్యము సలుపవె తన్మయత్వముతోన్
లోకములన్నియు వణకగ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 22

చిత్రము తోడను గొలువగ
మనమున నిండుగ ముదమున మసలుచు నుండున్
వెండిగిరి నుండి కరుగవె
శంకర శంకర యనగను శరణము నీవే! 23

ఖండాలు డుగను మారవె
చెప్పగ బోధలను యాదిశంకరుల కికన్
యాత్మకు నేమియు లేదని
శంకర శంకర యనగను శరణము నీవే! 24

జరజర ప్రాకుచు నుందురు
కోటయు కొండను మనసున కోరిక దీరన్
శివరాత్రి నాడు తలపగ
శంకర శంకర యనగను శరణము నీవే! 25

ఝరముల వారిను నభిషే
కింపగ జరజర మనమును క్రిందను పడగాన్
నీరును పవిత్రము గాదొకొ
శంకర శంకర యనగను శరణము నీవే! 26

చెంకణ దిగులవె ముంగిట
శివ శివ యంచును బలుకగ చిత్రము తోడన్
దరహాసము తోనుండవె
శంకర శంకర యనగను శరణము నీవే! 27

రాణా ఉండవె గుడిలో
యద్దముగను నిన్ను గాంచ యదలించు చుయున్
సత్యము దెలియక నింకన్
శంకర శంకర యనగను శరణము నీవే! 28

డంబికము లేకను యుండవె
యంబర మంతయు నిలచియు నాశిసులీయన్
స బరమున నుందుముగద
శంకర శంకర యనగను శరణము నీవే। 29

ఢక్కలు మ్రోగగ నిండుగ
గంగాధారీ యనలను గణములు పాడన్
మ్రొక్కరె యిలనిక భక్తులు
శంకర శంకర యనగను శఠణము నీవే। 30

తటముల నుండవె యీవును
వటముల బెట్టియు సలుపగ బూజల వింతన్
తడబాటేలర శంకర
శంకర శంకర యనగను శరణము నీవే। 31

దండము బెట్టియు నింకను
దండకముల వింతజదువ దండనయేలా
దండల తోడను గొలుచుచు
శంక్కర శంకర యనదను శరణము నీవే! 32

ధంధణ, ధంధణ, ధంధణ
తాండవ నృత్యము సలుపగ ధ్యానముతోడన్
ధ్వాంతము తొలగగ మనముల
శంకర శంకర యనగను శరణము నీవే। 33

నటరాజువు నీవే గద
నటనలు మేలర నట్రాజ నరులతో నికున్
నర నరముల శివనామమె
శంకర శంకర యనగను శరణమునీవే। 34

పరమేశుడవైన పరమ
శివుడవు నీవే గదయ్య శివ రూపమునన్
శివ శివ యనగను బలుకవె
శంకర శంకర యనగను శరణము నీవే! 35

ఫణిరాజువు నీవే గద
పాపము మన్నించి మము పవిత్రుల జేసే
పశ్చాత్తాపము నొందుచు
శంకర శంకర యనగను శరణము నీవే! 36

బుద్బుద ప్రాయము జీవము
దుర్భరమును గాదె మాకు దారియు దప్పన్
విబ్భరముగ చేదుకొనవె
శంకర శంకర యనగను శరణము నీవే! 37

భిక్షుకుడ వైన నేమయ
శిక్షకుడవు నీవు గాదె చరితార్థులవన్
సంరక్షణ నీకయెవిక
శంకర శంకర యనగను శరణము నీవే! 38

ముక్కంటిని గొల్వ రేలయ
ముందమున మనలను మురుపక మసలంగ యుండన్
మనుపేలర శివుని తలప
శంకర శంకర యనగను శరణము నీవే! 39

యాచకుడ వైన నేమయ
నీచుల గాపాడు యోచన మరుడ గాపే
పూజల జేయుచు నింకను
శంకర శంకర యనగను శరణము నీవే! 40

రాముడు నిలిపిన రామే
శ్వరుడవు నీవయె నిజముగ శ్రీరామునియున్
తలపున తలచు పరమశివ
శంకర శంకర యనగను శరణము నీవే। 41

లంకేశుని జంపగ నిక
యంశము నంపవె మసలగ మదిలో లీలన్
సంశయము గలుగ సతికిని
శంకర శంకర యనగను శరణము నీవే। 42

వందనము నీకు శంకర
యభివందన మికను జేయ యాశలు దీఱున్
చందనముల నిక జల్లుచు
శంకర శంకర యనగను శరణము నీవే। 43

శంకర, శంకర, శంకర
శంభో శంకర యనగను శరణము నీవే
శివ శివ శంకర యనుచును
శంకర శంకర యనగను శరణము నీవే। 44

షడ్భావ వికారములకు
గారణ మీవను యవుటను కొంచము దెలియన్
కోరుకొనగ నికముక్తిని
శంకర శంకర యనగను శరణము నీవే। 45

సంకల్పము గలుగగ నిక
శంకర సేవల సమముగ జేయగనింకన్
సన్నిధి నుండదె శివుడును
శంకర శంకర యనగను శరణము నీవే। 46

హరుడవు నీవేగదరా
హాలా హలమిషను ద్రావి హానది లేకన్ జేవే
హద్దులు లేకను తలచుచు
శంకర శంకరయనగను శరణము నీవే 47

క్షాళన జేయవె పాపము
క్షమికచి నిక భక్తులంత పరశత నుండఁన్
చేయుత నీయ నీవయె
శంకర శంకర యనగను శరణము నీవే 48

అంకుల రాట్నపు జీవిత
సంగ్రామములో రుచిరము శివ నామమెగా
సేవలు జేయుచు శివునకు
శంకర శంకర యనగను శరణము నీవే 49

అండవు నీవయె మాకును
మెండగ దండలను చేర్చి ముందుగ వేయనీ
చెంటాడ రావ పాపము
శంకర శంకర యనగను శరణము నీవే| 50

ఆకాశంబున నుండియు
యాగంగ భువికిని రాగ యాపవె శిరమున్
పావనము జేయ భక్తుల
శంకర శంకర యనగను శరణము నీవే. 51

ఇంచుక కొంచెము మైనను
సేవించగ శంకము నిక సంకోచములా
చెచ్చెర జేరగ శివునిక
శంకర శంకర యనగను శరణము నీవే. 52

ఈడలు బలుకగ నీకుచు
ఈసరుడనీవు వు గాదె యితములదీర్చన్
నెదుటుండ వెలిలుపగ నిక
శంకర శంకర యనగను శరణము నీవే॥ 53

ఉపచారములను జేయగ
యుత్పాతములను గలుగునే యుర్విని వింతన్
యపచారములను నైపవె
శంకర శంకర యనగను శరణము నీవే॥ 54

ఊతము నీవే జగతికి
ఏతము నీవే గద మాకు యెదురగ నింకన్
పాపపు కూపము నుండియు
శంకర శంకర యనగను శరణము నీవే॥ 55

ఋషభధ్వజుడవు శివయె
ఋషభము ఎదుటను నిలబడి ఋషివలె వింకన్
ఋజువుల జూపగ మాకును
శంకర శంకర యనగను శరణము నీవే॥ 56

ఎరురుగ నుండిన శివునియు
మనమున మరి మరి దలపగ మరి కొరవేలా
మనసున నిండుగ నిండగ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 57

ఏటి దటిని గల యీశా
కాటిని గూడ నిక తోడు కరుణను నీవే
తృటి లోన ద్రుంచ పాపము
శంకర శంకర యనగను శరణము నీవే॥ 58

ఐదు మోముల వెల్వడవుగ
"యమరావతి" నగరము నను నాకాశంబున్
నంటి వినరావె గోడుల
శంకర శంకర యనగను శరణము నీవే॥ 59

ఒరిపిడి చేయగ నామము
బలపడు శక్తి రసమిక పవిత్రత తోడన్
ఒనగుగ గొలవగ శివునిక
శంకర శంకర యనగను శరణము నీవే॥ 60

'ఓంకారము' నీవేగా
ఓంకారేశ్వరుడవీవు యొనర్చగ నింకన్
ఓలము నీయుమ మాకును
శంకర శంకర యనగను శరణము నీవే॥ 61

ఔగాములకును గారణ
మెవరుర? ముక్కంటి గాక ముందుగ నింకన్
ఔచిత్య మికను గలుగగ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 62

కాశీ యంతున నిలచియు
కనికర ముంచవె మిగులగ గంగయు దాకన్
పవిత్రగంగను దాకుచు
శంకర శంకర యనగను శరణము నీవే॥ 63

ఖండ పరశువవు నీవయె
మన్నన సేయవె మలినపు మనముల నింకన్
ఖండము సేయవె పాపము
శంకర శంకర యనగను శరణము నీవే॥ 64

గరళము నింపవె కంఠము
నిండుగ లోకంబులన్ని నూతన మనగాన్
సర్పమె హారము యెంచుము
శంకర శంకర యనగను శరణము నీవే॥ 65

ఘోరుడవై నిలువవె నిక
ఘటికా చలమున ఘనముగ ఘోరము లాపన్
ఘోషణ చేయుచు నిండుగ
శంకర శంకర యనగను శరణము నీవే। 66

చిత్తము నిల్పియు శివునిక
పూజింపగ తనివిదీర పుష్పాక్షతలన్
శంకలు దీరవె నింకను
శంకర శంకర యనగను శరణము నీవే। 67

ఘోటిక లోనని జూడర
శివునిక శివకంచి యందు చింతయు దీరన్
సంకటహరుణుడు శివుడని
శంకర శంకర యనగను శరణము నీవే। 68

జంబూ ఫలమును తినుచును
జంబూ కేశ్వరముననిలువవె జలమున
జపముల జేయుచు పిలువగ
శంకర శంకర యనగను శరణము నీవే। 69

ఝరముల తటముల నిలచియు
జగముల నేలవే కరుణను జనకుడ వైనన్
జంభము వీడియు గొలువర
శంకర శంకర యనగను శరణము నీవే। 70

ఉక్కెపు గంటలు గలగల
మ్రోగగ ఓంకార రవము ముదమున బలుకన్
నటరాజగుపడ చుండగ
శంకర శంకర యనగను శరణము నీవే! 71

రీవిగ విలువవె వేముల
వాడను లావులేగయగను వాదులు బల్కకన్
భీమకవివి గాపాడవె
శంకర శంకర యనగను శరణము నీవే! 72

డమరుకల ధ్వని వినగనె
తాండవ నృత్యము సలువరె ధన్యత జెంధన్
తబ్బిబ్బులవగ గణములు
శంకర శంకర యనగను శరణము నీవే! 73

ధుండికి తండ్రివి యయ్యును
దండము లేకుండ యుండి దర్శనమీయన్
వరముల నీయ విలచిన విశ్వేశా
శంకర శంకర యనగను శరణము నీవే! 74

తాపసి పతివై యుండవె
తనయ తనయులు బ్రోవ తథ్యముగ నిక
తాండవ మాడనే ఉమతో
శంకర శంకర యనగను శరణము నీవే! 75

దినమొల వేల్పువు నీవెగ
దశదిశల యెలగవె వేగ దర్శనమీయన్
ధన్యత జెందగ భక్తులు
శంకర శంకర యనగను శరణము నీవే! 76

ధన్వం తరిపై నిలువవె
ద్రాక్షారామమున నింక దక్షత నుండన్
'దిక్కు నని' నీవే యంనుచు
శంకర శంకర యనగను శరణము నీవే! 77

నాగులు గళమున నుండియు
పరిపూల సీయవె నిజముగ వడివడి వేగన్
పంచముఖుడపై వెలయగ
శంకర శంకర యనగను శరణము నీవే! 78

పరమ శివా! యని బిలువగ
పరి పరి విధముల ప్రియమున భక్తియు గలుగన్
బాంధవ్య దగుటగు గావవె
శంకర శంకర యనగను శరణము నీవే! 79

పాలాక్ష దౌట చేతను
దెరువగ పాలాక్ష మికను తేజముతోడన్
ఫలితము జెప్పగ తరమే
శంకర శంకర యనగను శరణము నీవే! 80

బద్ధుడ నీవే గదరా
బంధము తొలగగ బంధన ములితన్
పొగడగ నీవెగ బంధుగుయీవని
శంకర శంకర యనగను శరణము నీవే! 81

భర్గుడ వైనను నీవయె
భీతా హవములను బోవ బాధ్యుడ నీవే
భవభయ హరహర యీశా
శంకర శంకర యనగను శరణము నీవే! 82

మరు గాంగను సేవింపరె
మనసున మాయయు దొలగగ మార్గము దెలియున్
మరిమరి కొలువగ శివునియు
శంకర శంకర యనగను శరణము నీవే. 83

యమము వయ్యును నికసేయరె
యాచన యతుల వలె నికను యాయావారముయున్
శూలము నొక చేతనుండగ
శంకర శంకర యనగను శరణము నీవే. 84

రుద్రుడ భద్రుడ నీవయె
రుద్రభూముల నీవుయుండ రౌద్రము తోడన్
రౌద్రము తరుగదె భక్తితో
శంకర శంకర యనగను శరణము నీవే. 85

రోహితము చేతబట్టియు
లోకము లేలవె నృపతిగ లోపము లేకన్
లోటును దీర్చగ నీవయె
శంకర శంకర యనగను శరణము నీవే। 86

వృషభము నెదురుగ నుండగ
వృషాంక పాణియు నిలువదె వృషముల దెల్పన్
వృజినము సేయవె దూరము
శంకర శంకర యనగను శరణము నీవే॥ 87

శంకలు దీర్చర శంకర
సంకుచితంబులను లేక సతతము తలపన్
భక్త పరవశుడ వైనచొ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 88

షండము నెతురుగ నుండగ
ప్రసన్నుడును గాడెయిక బరమేశ్వరుడున్
'ప్రణవము' బలుకగ శక్తితో
శంకర శంకర యనగను శరణము నీవే॥ 89

సాంబ శివుడవై నిలువవె
సదాశివుడవై వెలసియు సదశివ కోనన్
సంకటముల నిక దీర్చర
శంకర శంకర యనగను శరణము నీవే॥ 90

హరుడవు నీవేగద శివ
హరింప జేయ నికనైన హరహర యనగన్
హర హర శివ శివ యనగను
శంకర శంకర యనగను శరణము నీవే॥ 91

క్షేత్రము లందున జూడగ
క్షేత్రియు నీవయె సకలము నేపము నుండన్
క్షమియించర నిక మమ్ముల
శంకర శంకర యనగను శరణము నీవే॥ 92

కైలాస కోన నీవయె
సదా--శివ కోనలను నీవయె శంకములేకన్
మిగుల తలకోన నుండవె
శంకర శంకర యనగను శరణము నీవే॥ 93

శ్రీకాళ హస్తులకు నిక
మోక్షము నీయవె జననము మరియిక లేకన్
భక్తి కిమించిన దేవర
శంకర శంకర యనగను శరణము నీవే। 94

కన్నడి క్రీయవె మోక్షము
కంటిని నర్పింపగ నీకు కానుకగ నికన్
పూజింపగ నిక మాకును
శంకర శంకర యనగను శరణము నీవే! 95

లింగపు రూపుడవైనను
సింగారము జేయ నీకు చిత్తము తోడన్
బంగరు కొండవు నీవెగ
శంకర శంకర యనగను శరణము నీవే॥ 96

మక్కాన యందున నిలువవె
కాశీవిశ్వేశ్వరునిగ కరుణను జూపన్
కల్యాణమింక జరుపగ
శంకర శంకర యనగను శరణము నీవే! 97

వేముల వాడను విరియవే
భీమేశుడవై మిగులగ భక్తితో గొలువగ
భీమ కవి నీయవె దయను
శంకర శంకర యనగను శరణము నీవే! 98

సైకత లింగము చేరున
రామేశ్వరమున వెలియవె రాముని చేతన్
రామేశా రక్షయనుచు
శంకర శంకర యనగను శరణము నీవే॥ 99

నాట్యాచార్యుడివిగ ని
ల్వవె నటరాజుగ ధమ ధమల నడుమనింకన్
కొలువ చిదంబరమున నిక
శంకర శంకర యనగను శరణము నీవే॥ 100

నీటను నుండియు "జంబుక"
నాడును కాపాడరావె నిర్మల మనమున్
"సత్యము" గోచర మనగను
శంకర శంకర యనగను శరణమునీవే| 101

కాశీ యందున కాశీ
విశ్వేశ్వరుడవు గావె కన్నులు చెదరన్
గంగను తాకుచు వింకను
శంకర శంకర యనగను శరణము నీవే| 102

గంగాధరా త్రినేత్రా
సాంబ సదాశివ నమోస్తు శంకర నీకున్
నిర్మల మనమున దలచుచు
శంకర శంకర యనగను శరణము నీవే| 103

గరళము మ్రింగిన సామీ
గంగను జటమున నిలిపిన గంగాధారీ
గంటలు మ్రోగుచు నుండగ
శంకర శంకర యనగను శరణము నీవే| 104

శ్రీమార్కండేయునకును
యాయుషు నీయవె శివ శివ యంచును వేడన్
చెంతను యుండవె సతతము
శంకర శంకర యనగను శరణము నీవే! 105

నాగులె హారము గాగా
త్రిశూలమె యాయుధంబు తితిపెమునకికన్
యంబిక చెంతను యుండగ
శంకర శంకర యనగను శరణము నీవే| 106

"విలయము" మూలము నీవయె
"ప్రళయము" రాకకు కతనము పెద్దగ నీవే
తాండవ నృత్యము సేయగ
శంకర శంకర యనగను శరణము నీవే 107

అమర పురమందు నిక
అపరేశ్వరుడిగ నిలువ తాడి ప్రమాణంబునన్
"నెత్తుటి" ధారల జూచుచు
శంకర శంకర యనగను శరణము నీవే 108

శంకర శతకము వ్రాయగ
తలచితి "శంకరు" కరుణను తప్పుల దిద్దున్
వేడెద భక్తుల మరి మరి
శంకర శంకర యనగను శరణము నీవే 109

వ్రాసితి శతకము నొకటియు
చేకొను "శంకర" దయగని చిర్నగవులతోన్
ప్రేమతో బ్రోవగ గోరెద
శంకర శంకర యనగను శరణము నీవే 110

చి. ల. నా. శాస్త్రిని " చిన్నక్కె-
న స్థిర వాసుడ, "శివులకు" గలిగి యుంటిన్
భారద్వాజన గోత్రుడ
శంకర శంకరయనగను శరణము నీవే 111



ఓం శ్రీ సిద్ధి విఘ్నేశ్వరాయనమః

# పాండురంగ శతకము

## రచనః— శతక కవి చి॥ల॥నా॥శాస్త్రి

శ్రీకరముగ వెలసి సిరుల నొసంగగ
పండరి పుర మందు పరవశించి
గంగ రంగ యమునగ రమణీయము గాదె
పండరి పుర వాస పాండురంగ! 1

రఖుమ దేవి నిలిచె రంగని గూడను
దేవదేవు డతడె దివ్యరూపు
పాండురంగ యనగ పరికించి జూడడె
పండరి పురవాస పాండురంగ! 2

చిక్కు "పక్కు" కింక సేవలు చేయవె
భక్తు రాలి బాధ తీర ద్రోల
భక్త దాసు డతేగ భక్తితో గొలువంగ
పండరి పురవాస పాండురంగ! 3

"చంద్రభాగ" తటిని చక్కగ నిలువవె
పాండురంగడిదిగ పద్మ నాళ,
"పుండరీకు" డంచు పొదువున బిలువగ
పండరి పురవాస పాండురంగ! 4

"చంద్రభాగ" పారె జక్కగ చుట్టి చుట్టి,
"చంద్రవంక" వోలె చక్కగాను,
చిత్ర మగు నదియు, చిత్తోల్లాసముగాక
పండరి పురవాస పాండురంగ! 5

పండరి పురమందు పరుగున వెలసిన
"పండరీశు" నవె "పాండురంగ"!
రంగ రంగ యనగ రంగము జేయవె
పండరి పురవాస పాండురంగ! 6

రంగ రంగ యనగ రంగడె నీవేగ
రంగ నామ మింక రక్తి గట్ట
పొంగు చుండె భక్తి పుట్టల కొలదిని
పండరి పురవాస పాండురంగ! 7

పుండరీకు భక్తి పుణమిని దెలియగ
తల్లి దండ్రి సేవ దాను జేయ
వేచి యుండలేదే వెలుపలి "వాకిట"!
పండరి పురవాస పాండురంగ! 8

తల్లి దండ్రి కింక తగినంత సేవల
సేయ గల్గ నిలను సాటి యేమి?
"పుండరీకు" గూర్చి పూర్తిగ దెలియగ
పండరి పుర వాస పాండురంగ! 9

భక్తి శక్తి యింత భరియింప తరమేగ
దేవదేవు డింత దరలి వచ్చె
పుండరీకు డింత పుణ్యమూర్తియు గాగ
పండరి పురవాస పాండురంగ! 10

తల్లి దండ్రు లింత దైవ భక్తిని యుండ
పుత్రరత్న మితను పోకిరయ్యె
సంపదింత జూసి సుఖముల మరగగ
పండరి పురవాస పాండురంగ! 11

అక్క జెప్పు వినక యాలి జెప్పు, వినక
తల్లి, దండ్రి మాట దప్పు బట్టి
పెద్దలంత జెప్ప పెడ చెవి నుంచడె
పండరి పురవాస పాండురంగ! 12

సొంతయింటి లోన చోద్యము లేకను
దొంగ తనము చేసి దోచుకొనియు
"దేవదాసి" తోడ దోబూచు లాడగ
పండరి పురవాస పాండురంగ! 13

తల్లి దండ్రి మాట తలచక నింతనూ
యాలిమాట కింక యడ్డు దగిలె
"దేవదాసి" "పలుకు" దీపమై వెలగంగ
పండరి పురవాస పాండురంగ! 14

ఇంటిలోని నగల యింత మూటగ గట్టి
ముసుగు తోడ నింక మోసగించి
అడ్డదారి బట్ట "యమున్రయో" యట్టగ
పండరి పురవాస పాండురంగ! 15

తనయుఁ గొరకు నింక దల్లియు గూడను
నోరు మెదప కుండ నూఁకుండె
"తల్లి పహాశ" మింక దగమేర జెప్పగ
పండరి పురవాస పాండురంగ! 16

తల్లి బట్టు గొనగ తనయుని చేతిని
యుఁగ రంబు యింక నూడి రాగ
గుర్తు పట్టి, తల్లి గుట్టును దాచదె
పండరి పురవాన పాండురంగ! 17

తల్లి బాధ నింక తనయుడు దెలియక
వొద్దు మీరి పోయె యవధి దాటి
"పొందు" లోన నింక పొందగ "నందము"
పండరి పురవాస పాండురంగ! 18

దొరికినంత యింక దొంగతనమును జేసి
దేవదాసి కిచ్చె దొంగ సాము
"మనము" యంత నింక మాయయు, చిద్విలాసము గాక
పండరి పురవాన పాండురంగ! 19

కులుకు చుండె మిగుల కులటల తోడనూ
మసలు చుండె నింక మాయ గవ్వ
మరులు గొలుపు చుండ మాయ లోకము నందు
పండరి పుర వాస పాండురంగ! 20

కనుల మైక మింక గదల నీయక యుండ,
పొరల మైక మింక పొంగి పొరల
తరలె కులట బసకు తత్తరముగ నింక
పండరి పుర వాస పాండురంగ! 21

కులట యింట నింక కులుకుచు నుండదె
యాలి నింక నైన నంటకుండ
తల్లి, దండ్రి మాట తలబరువై యుండ
పండరిపురవాస పాండురంగ! 22
క్రోధ తాపములతో కురవగ కన్నీరు
“తాప” కరిగె నింక కన్నవారు
పుట్టి నింటి కేగె పుణ్యవతి సతియు
పండరి పురవాస పాండురంగ! 23

ఇంటి లోనె యుంచె యింపుగ కులటను,
ప్రేమ పొంగ నింక పెన్నిధినుచు
మాయ యెట్లు తొలగు మైకమునందుండ
పండరి పురవాస పాండురంగ! 24

తల్లి, దండ్రు లింక తల్లడిల్లుచు నుండ
కొడుకు లింక "యోగ" కులుకు చుండ
చూచు వారి కెల్ల "చోద్యము గాదొకో"
పండరి పురవాస పాండురంగ 25

కాగు విడడె యింక పరువము వెంటనా
యౌవన పడడె యింక వద్దు మీరి
'సద్గుణస్త్రీ' గూడ ముచ్చట నుండడె
పండరి పురవాస పాండురంగ! 26

దోపిడీలు జేసి దొంగ సొమ్మును దెచ్చి
కులట కిడె నింక కుతియు దీర
భటులు పట్టుకొనగ బంధితు డవ్వడె
పండరి పుర వాస పాండురంగ! 27

దొంగతనము జేయు దోషమునుంచు నెంచి
ధర్మరీతి నిచ్చె తగిన దీర్పు
కాళ్ళు దీసి చేతు కఠినము గానిక
పండరి పురవాస పాండురంగ! 28

చిన్న నాడే గొట్ట చేతుల మీదను
తలకు మించు శిక్ష 'తప్పు' కన్న
పెద్దయైన పిదప పెరుగు పాడు తప్పు
పండరి పురవాస పాండురంగ! 29

కోరి కోరి యింక కులటను జేరగ
కాళ్ళు పోయె నింక కర్మ కొలది
కాళ్ళు పోయి పంత 'కరవదె' కులటయు
పండరి పురవాస పాండురంగ! 30

కులట తోడ యింక కూరిమి యింతెగ
దరిద్రుడవక తప్ప దారి లేదు
కాళ్ళు లేవి వాని గాంచునే కులటయు
పండరి పురవాస పాండురంగ! 31

కాళ్ళు లేక యింక కదులుట యెట్లురా
దోగుకుంటు బోడె దోవ బట్టి
పాప కర్మ కికను ఫలమును యిదియేగ
పండరి పురవాస పాండురంగ! 32

కాళ్ళు పోయినంత కనువిప్పు గలుగగ
కారడవుల జేరే గతియు లేక
యూర నుండ నింక వోగును గాగను
పండరి పురవాస పాండురంగ! 33

కులట జూడ గలదె కూరిమి తోడను
తల్లి, దండ్రు లేరి దగ్గరింక
నిగమశర్మ మనము నిర్మల మవ్వదే
పండరి పురవాస పాండురంగ! 34

కర్మ కొలది కదలి కానల జేరె
"అమ్మ అమ్మ" యంచు యరచి యరచి
తల్లి, దండ్రు లింక "తలపుకు" రాగను
పండరి పురవాస పాండురంగ! 35

"అమ్మ అమ్మ" యంచు యాతృత జెందడె
"కాన" యంత దిరిగె కళ్ళు తిరుగ
కంద మూలములను 'కరిచె' గతియు లేక
పండరి పురవాస పాండురంగ! 36

పుండరీకు డింక పుడమిని బ్రాకుచు
తల్లి వింక దలచి తల్లడిల్లె
తండ్రి మదిని మెరయ దవ్వును దెలియడె
పండరి పురవాస పాండురంగ! 37

కడుపు నిండె నింక 'కన్న' వారి బిలువ
తల్లి, తండ్రి తోడ తనువు నిండె
మనసు నిండె నింక మందహాసము తోడ
పండరి పురవాస పాండురంగ! 38

కాళ్ళు లేకనె యిక కాదు యంత దిరిగ
రక్త ధార గట్టె రాచు కొనియు
కడుపు లోని బాధ కక్కుచు నింకనూ
పండరి పుర వాస పాండురంగ! 39

మనసు లోని బాధ మరియెవరికి జెప్పు
అడవి లోన నింక ఆర్తి దీర
చెట్టు - చేమ లేక తప్పగా నింకనూ
పండరి పురవాస పాండురంగ! 40

దైవ భక్తి గలిగె దారియు లేకనూ
మనసు లోని బాధ మాయు మయ్యో
దైవ భక్తి పెరిగె ధన్యత జెందగ
పండరి పురవాస పాండురంగ! 41

దైవ మింక మిగుల తలపునకు రాగ
ధ్యాస కలుగ నింక తల్లియుండు
ఫలము కలుగు గాదె బాధలు తీరగ
పండరి పురవాస పాండురంగ! 42

భక్తి తోడ మిగుల ప్రార్ధన చేయుగ
భక్తి తోడ ప్రేమ పారగాను
భక్తి ప్రేమ కన్న బహుళము యేమిరా
పండరిపురవాస పాండురంగ! 43

కాదు యుండు గాంచె కమ్మని ముగ్గుల
చెమరె కనులు యింక చెప్ప లేక
ముగ్గులెట్లు వచ్చె ముంగిలి యుందున
పండరి పురవాస పాండురంగ! 44

తిరిగి తిరిగి తిరిగి తేరి పారగ జూడ
యడవి యందు జూచె యబ్బురముగ
పర్ణశాల యొకటి పరవశము నుజెంద
పండరి పురవాస పాండురంగ! 45

రంగ వల్లుల గని రంజిల్ల మనమును
ముగ్గురమ్మ లింక ముగ్గు లేయ
ముద్దు గుమ్మల గని మురిసి పోవగ నింక
పండరి పురవాస పాండురంగ! 46

ఎవ్వరెవరో నింక యెరుగంగ కోరియు
కతన మేమి యింక గాన లేక
కదిలె ముందు కింక కడు దీనముగ నింక
పండరిపురవాస పాండురంగ! 47

మధుర పరిమళంబు మందార వీచిక
యడవిలోన జూడ యద్భుతంబు
చూడ, జూడనింక చోద్యంబు లెన్నియో
పండరి పురవాస పాండురంగ! 48

తీరునున్న ముగ్గు తేరిపారగ జూసి
దైర్యము గొని యింక దాపు కేగ
తనివిదీర జూచి తన్మయత్వము జెందె
పండరి పురవాస పాండురంగ! 49

ముద్దు గుమ్మలగని ముచ్చట పడగను
పాపు బుద్ధి మనల పైకి వచ్చె
పట్టుకొనగ జేగ ప్రాకు లాడె వేగ
పండరి పురవాస పాండురంగ! 50

కాకినంత యింక తరుణుల మువ్వర
మూతు మవదె రూప, మహిమ చేత
అంత్యమైన రూపు యదృశ్యంబును గాగ
పండరి పురవాస పాండురంగ! 51

మంచి రూపు బోయి మసి రూపమును బొంద
మొద్దుబారి పోయె మోహ మంత
కాళ్ళు లేక గూడ కదుపంత కామమా
పండరి పురవాస పాండురంగ! 52

కవగ వారినింక గంగ యమున సర
స్వతులె నంచు తెలియు కావ మీయు
వాక్, శక్తి చేత వలదంచు వేడడె
పండరి పుర వాస పాండురంగ! 53

తల్లి, దండ్రి నింక దలపక యున్నచో
కర్మ మేది పోదు కాటి యందు
కండ కావరంబు కలనైన పోవునే
పండరి పురవాస పాండురంగ! 54

తల్లి, దండ్రి నింక తలచుచు మిగులంగ
యడవి యింత దిరిగె యాశ చేత
దొంగుకుంటు బోవ దోషంబు పోవదే
పండరి పురవాస పాండురంగ! 55

తివిరి, తివిరి, తివిరి తిండి తిప్పయు లేక
తులసి సొలసె మిగుల యాదమరచి
పూర్వ జన్మ కృతము పోవునే ఎట్లయిన
పండరి పురవాస పాండురంగ! 56

నిదుర లేచి నంత నెమ్మది గ దిరిగె
మరల, మరల మరువ లేక
తల్లి, తండ్రి నింక తలచి, తలచి యింక
పండరి పురవాస పాండురంగ! 57

జాలి దలువ నింక జనులును లేరుగా
'దైవ' మొకటి దప్ప దారి లేదు
'దేవుడు' గలడంచు దెలియ ఘనము గాదె
పండరి పురవాస పాండురంగ! 58

కాన యింత దిరిగె కాళ్ళయు లేకను
దైవ మూండె నంచు తలచి తలచి
తపము జేసినట్లు తపియించె దేవుని
పండరి పుర వాస పాండురంగ! 59

కాళ్ళు నొప్పి బుట్ట కన్నీరు గారగ
దేహమున్ను డస్సి తిరిగి తిరిగి
నోరు నొవ్వ నింక నోకార బిలువంగ
పండరి పురవాస పాండురంగ! 60

'అమ్మ, అమ్మ' యంచు అవురావురు మంచు
'కన్నులింక దిరిగి కండ్లు మూయ'
పూర్వజన్మ కృతము 'పూలవాన' కురియ
పండరి పురవాస పాండురంగ! 61

పూలవాన గురియ పులకించి బోవగ
పర్ణశాల యొకటి ప్రక్కనుండ
దోగుకుంటు బోడ 'తోచక' నేమియు
పండరి పురవాస పాండురంగ! 62

లోని కేగినంత లోగుట్టు తెలియదె
బయట నుండి జూడ భంగపాటె!
లోన నున్న నాని లోతుగ గాంచర
పడంరి పురవాస పాండురంగ! 63

తోలు గప్పి యున్న తూటు దేహ మిదిర!
బయట మాయ గాంచ బ్రతుకు చెల్లు?
యాత్మ నికను బట్ట యంతును దెలియదె
పండరి పురవాస పాండురంగ! 64

వేగుచుంటు బోడె దేహీ, దేహీ యనుచు
దాహమడిగె నింక దారి లేక
బయట నెవరి గనక బాఇడే లోనికి
పండరి పురవాస పాండురంగ! 65

లోన జూసినంత లోగుట్టు దెలియదె
తల్లి, దండ్రుల గన తల్లడిల్లె
కౌగిలించు కొనడె కన్నీరు గార్గ
పండరి పురవాస పాండురంగ! 66

మాత, పితల దాక మరి రాగ వాళ్ళను
తల్లి దండ్రి శక్తి తనకు దెలిసె
పాద మంటి మరిక ప్రదక్షిణ సేయడె
పండరి పురవాస పాండురంగ! 67

పాప మంత పోయె పలురకములు గను
తలి, దండ్రి సేవ దాను జేయు
కర్మ పక్వ మయ్యె కారణాంతంబుగ
పండరి పురవాస పాండురంగ! 68

తల్లి, దండ్రి కికను తగుసేవ జేయగ
తల్లి, దండ్రి యొద్ద తాను యుండ
తల్లి దండ్రి కింక తక్కువేమిర నింక
పండరిపురవాస పాండురంగ! 69

తల్లి దండ్రుల నిడి 'తా' నుండ గలడకో
తల్లి దండ్రి శక్తి తాను దెలియ!
తల్లి దండ్రి కింక దగ్గర యుండడె
పండరి పురవాస పాండురంగ! 70

తలి దండ్రి యాస దానిక దీర్చడె
తల్లి దండ్రి దివ్వె తాను బొందె
తల్లి దండ్రి ఋణము తాను మరిక దీర్చె
పండరి పుర వాస పాండురంగ! 71

తల్లి దండ్రి సేవ తప్పక చేయుచు
యతిని దేవతలను యాదరించె
తల్లి దండ్రి సేవ తథ్యమునియు చాటె
పండరి పుర వాస పాండురంగ! 72

తల్లి దండ్రి చేత ధన్యత చెందగ
పుండరీకు భక్తి పున్నె మవగ
"శ్రీహరి" పిలుపుయును చెవినింక సోకునా?!
పండరి పురవాస పాండురంగ! 73

హరియు వచ్చి యింక యావాకిటను నిల్చి
"పుండరీక" యనుచు పొదిమి పిలువ
విఫలమయ్యె పిలుపు 'విపరీత' మికగాక
పండరి పుర వాస పాండురంగ! 74

అలసి, సొలసి, నిలిచె యుచ్చైరు నొందగ
'ఆగ' మంచు దెలిసె నంత దాక
'తల్లి దండ్రి' చెంత తానుంటి ననుచునూ
పండరి పురవాస పాండురంగ! 75

'ఇటుక' రాయి నిచ్చె 'యింతగ' నిలువ గ
'నడుము' చేతులుంచె నడువ లేక
'ఇరలు' దయ్యె నింక ఇటుకను నిలువగ
పండరి పురవాన పాండురంగ! 76

నగమె యంచు చాటె 'సంసార సంద్రము'
'నడుము' లోతె యంచు నవ్వి పలుక
దాట మంచు దెలిసె దారియు దెలియంగ
పండరి పురవాన పాండురంగ! 77

నేనయు 'హరి' నంచు నెమ్మదిని బిలువ
'కాచు' కొనగ జెప్పె 'కష్ట' మునక
'కన్నవారు' యింక కలత నిదురనుండ
పండరిపురవాస పాండురంగ! 78

—

భక్తదాసుడింక భక్తికి లొంగడె
'యిటుక' మీదె యుండె యింపుగాను
వేచి యుండ లేదె వేద మూర్తియు గూడ
పండరి పురవాస పాండురంగ! 79

రుక్మిణింక వచ్చె రూపును మార్చియు
వెదకి, వెదకి యింక వేగిరముగ
ప్రక్క నింక నిలిచె పతి చెమట తుడువ
పండరి పుర వాస పాండురంగ! 80

తల్లి దండ్రి సేవ తదుపరి నింకనూ
భక్త పుండరీకు బయటు కొచ్చె
హరిని జూసి యింక యడుగడె 'మన్నింపు'
పండరి పుర వాస పాండురంగ! 81

భక్తి యునగ నీదె భళిభళి యనుచును
"మోక్ష" మిచ్చెదనట ముందుగాన
తల్లి దండ్రి కిడను తాదెల్పి మరలెదన్న
పండరి పురవాస పాండురంగ! 82

చెప్పి రావదేల? చెప్పిరే రావయ్య
చెప్పకుండ యెట్లు చేటుగాదె
తథ్యముగను జెప్పి ధన్యత చెందవె!
పండరి పురవాస పాండురంగ! 83

లోని కెళ్ళి జూడ లోనను గానక
తల్లడిల్లె మిగుల తనయుడింక
"లేని" వార్త దెలువ లోలోన గుములుచు
పండరి పురవాస పాండురంగ! 84

"లేగని" దిగు లేల లేచిరా యింక నీవు
"స్వర్గ" మింక వారు చనగ లేదె
"మిగులు" నీవె యింక మురియుచు రావేర!
పండరి పురవాస పాండురంగ! 85

కలియుగమున నీవు కలకాల మిట్లగ
'హాపు' పండియుండు ఋజువు పరుప
భక్తి శక్తి దెలిపి భక్తుల బ్రోచుచు
పండరిపురవాస పాండురంగ! 86

నిదు పేర యింక నిజపుర మొకటియు
వెలసియుండు నింక వేగిరముగ
భక్తులెల్ల మిగుల బహువరముల నొంద
పండరి పురవాస పాండురంగ! 87

"పండరి" యందు యుండ "పాండురంగడి" వేగ
"ఇటుక" మీద యుండ "యిరలా" డవేగ
"రంగ, రంగ" యనగ రంజించు విభుడవే
పండరి పురవాస పాండురంగ! 88

పాదములను రెంటి పట్టియు గట్టిగ
నమ్మి యుండు వారి నమ్మకముగ
సాగరమును గూడ సరిదారి జూపుచుయుండ
పండరి పురవాస పాండురంగ! 89

మూడు వరము లింక మెచ్చుట గోరగ
ముద్దు గిచ్చె మరియు మురహరి యింక
యంత లీనమవడె యా'హరి' యందున
పండరి పురవాస పాండురంగ! 90

కొలుచు వారి కింక కొంగున బంగారే
పాండురంగ యంచు పలవరింప
పలుకుచుండు స్వామి పంతము లేకను
పండరి పురవాస పాండురంగ! 91

బచ్చుకృష్ణ రావు భక్తితో గొలువంగ
భార్య గూడి యుండ బలు విధముల
పత్యాలెత్తి రావె 'పవిత్ర తిరుపతికి'
పండరి పురవాస పాండురంగ! 92

తిరుపతి పురి జేర తిన్నగ నింకనూ
'యతని' పనులకికను యధికుడవగ
'రంగ, రంగ' యంచు రంగని గొలువడె
పండరిపురవాస పాండురంగ! 93

చిన్ననాటి నుండి చిరుభక్తి తోడనూ
'పాండురంగ' నికను పలు విధముల
గొలిచె, గురిగ నింక 'గుడి' నిక నిర్మింప
పండరి పురవాస పాండురంగ! 94

తల్లి దండ్రులింక దగు భక్తి నుండగ
'కృష్ణ రాఘు గొలిచె గొప్పగాను
తిరుపతి పురి యందు తెంపుగ సతియుండ
పండరి పురవాస పాండురంగ! 95

పండరి పుర జనరె పట్టుగా నింకనూ
వర్ష వర్షమునకు వరుసగాను
రెండు మార్లు మరియు రెప్ప పాటున నింక
పండరిపురవాస పాండురంగ! 96

ముదుసలి తనమందు ముచ్చట దీరగ
తిరుపతి పురి యందు తిన్నగాను
కట్టనెంచె గుడిని కనగ రంగ నచట
పండరి పురవాస పాండురంగ! 97

పటము తోడ నింక భజనలు చేయుచు
వీధులన్ని తిరిగి విరివిగాను
భార్యతోడ నింక బహు భక్తి చేతను
పండరి పురవాస పాండురంగ! 98

ధనము దొరుక నింక తగినంతగా నిక
స్థలము కొనడె నచట చాలినంత
గుడియు నలరె నచట గొప్పగా నికను
పండరి పురవాస పాండురంగ! 99

ిడిని గట్టె మిగుల గొప్పగ నింకనూ
గహాముల కొరకును వెదకులాడె
రికింక లేక తెమల లేకను యింక
ండరి పురవాస పాండురంగ! 100

లిసి వచ్చెనింక తెములక యుండగా
ాండు, రఖుమా' ప్రతిమ పండరినిక
కృ వంశజులెగ ఓర్పుతో పీయగా
ండరి పురవాస పాండురంగ! 101

లవరింత గలిగె గనినట్లు ప్రతిమల
ృష్ణరావు కింక కలల, యందు
ుయపురపు' రాజు సేయింప నెంచగ
ండరి పురవాస పాండురంగ! 102

యపురపు రాజు జయ రావునందున
పడియు గట్టు నెంచె గురుతుగాను
పతిమ జేయ దెల్పె పండరి శిల్పికి
పండరి పురవాస పాండురంగ! 103

పండరిపురి యందు ప్రతిమలు జేయగ
కత్నమయమునకు తథ్యముగను
నిలువ దలచె రాజు నిజముగను 'ప్రతిష్ట'
పండరి పుర వాస పాండురంగ! 104

'పాండురంగ' దెల్పె ప్రతిమల గొని దెచ్చి
'పురిని' నిల్పు మయ్య 'పుణ్యమంత'
'నేను' లేన తోడు నిజముగ నీకను
పండరి పుర వాస పాండురంగ! 105

కలయు గుర్తు రాగా కన్నులు దెరువంగ
'పాండురంగ' యంచు 'పదుల' మూరు
తలచి, తలచి యింక తన్మయమును జెంద
పండరి పుర వాస పాండురంగ! 106

దంపతు లిరువురిక దాపుకు జేరియు (పండరి)
'పాండురంగని' గని పరవశించి
క్రొత్త దనము గొల్ప కోరిక దెల్పనే!
పండరి పురవాస పాండురంగ! 107

శిల్పి యొద్ద కేగి చెప్పగ 'స్థపతికి'
'తిరుపతిపురి' నుండి తీర్థు లేగ
'పాండురంగ' దెలిపె ప్రతిమల మాకీయ
పండరి పురవాస పాండురంగ! 108

ప్రతిమల గొని దెచ్చి పట్టుగ పురికిని
మేళ తాళములును మిన్నుయంట
పురపు వీధులన్ని పూలతో నిండగ
పండరి పుర వాస పాండురంగ! 109

'తిరుపతిపురి' యంత తిరునాళ్ళు జేయరే
'పండరి భజనలును' ప్రబలమవగ

పీడులన్ని మిగుల వింత కాంతులెగయు
పండరి పురవాస పాండురంగ! 110

'వ్యయ' నామవర్ష వైశాఖ బహుళమి
సప్తమి తిథి యందు సంభ్రమముగ
పాండు, రఖుమ లింక ప్రతిష్ఠింప బడగ
పండరి పురవాస పాండురంగ! 111

బచ్చు దంపతులను పవిత్రులు గారొకో
పుండరీకు డీయు పుణ్యమింత
పు ప్రజలను గూడ పుణ్యము పొందరే
పండరి పురవాస పాండురంగ! 112

'చిన్న మక్కెన' సూరి చిన్నవాడను నేను
వ్రాసికుంటి నయ్య వరుస రీతి
చేకొను మిక రంగ చిన్నగపుడ నింక
పండరి పురవాస పాండురంగ! 113

గుంట్రు మండలమున గుట్టుగా యుండెడి
కా మాశివుల ననుగు కన్నవాడు
లక్ష్మీనారాయణని లక్షణముగ బిల్వ
పండరి పురవాస పాండురంగ! 114

పాండురంగ శతక పఠనము చేయున
పాండురంగ డిచ్చు బహుళ సిరులు
రంగ రంగ యంచు రంగని కొలువగ
పండరి పురవాస పాండురంగ! 115



ఓం శ్రీ సిద్ధి విఘ్నేశ్వరాయనమః

# వేణుగోపాల శతకము

## రచనః- శతక కవి చి॥ల॥నా॥శాస్త్రి

శ్రీకరముగ నిలువ చిరుదీపము వలె
సిరులు పొంగి పొరలె చిర్నగవున
చెంత జేరినంత చింతలు దీఱగ
వేణుగోప బాల వేగరార 1

అవనిగడ్డ దాట యల్లన నగుపడు
హంస (ల) దీవి యొకటి ఆనవాలు
వేణు గోప వెలసె వేడ్కతో నచటను
వేణుగోప బాల వేగరార 2

ఆకసంబు నుండి హంసల దీవిని
చూసినంత నింక చోద్యమలర
నిలచె నచట నింక నివ్వెరపడగను
వేణుగోప బాల వేగరార 3

కాకి హంస అయ్యె గలి యుగ మందున
సంగమంబునందు స్నానమాడ
కల్కి జనుల కింక కనువిప్పు కలుగగ
వేణుగోప బాల వేగరార 4

“గొల్లపూడి” వారు “కుప్ప” వారిని గూడి
కలసి చేయు పైరు కృష్ణ యందు
చేర సంగమంబు సంతసమున నింక
వేణుగోప బాల వేగరార 5

గాలి వాన వీచ గొప్పగ మరికను
నావ తల్లడిల్లె నడుప లేక
తల్లడిల్లెవారు దిక్కుయు లేకను
వేణుగోప బాల వేగరార 6

దిక్కు మొగము లేక భయ భక్తులనిక
చేతు లెత్తి మ్రొక్కి చెంత జేర్చి
కనులు దెరువ నావ కదలక యుండదె
వేణుగోప బాల వేగరార 7

అల్లై నిలచి యుండె నంటియు దీపము
గోడనింక వాన గాలి కింక
నదురు బెదురు లేక నావయు నిలువగ
వేణుగోప బాల వేగరార 8

దీప గోడ నెక్కి తెంపుగ జూడగ
గాన బడియె నొక్క గ్రామ మొకటి
శిఖర మొకటి గనరె సూటిగ నచటను
వేణుగోప బాల వేగరార 9

చేతులెత్తి మ్రొక్కి శిఖరమునకును
వాన, గాలి తగ్గె వరుస గాను
తెప్పరిల్లనింక తొందరపడగను
వేణుగోప బాల వేగరార 10

చీకటి పడినంత చేయునది యు లేక
గమరి ముసిరె తలపు కలత లింక
కనులు మూసిన త కదలదె గాఢయు
వేణుగోప బాల వేగరార! 11

కనులు దెరచి జూడ గన్పడె రేవుయు
నమ్మక యుండె నిజములన్ని
నావ నిడువ తరమె నిజముగ యచటను
వేణుగోప బాల వేగరార। 12

ఒడ్డుమీఁడ జూడ యొకచోట నగుపడె
శిఖర మొకటి నింక చింత దీఱ
నులు చెమరె మిగుల కలతయు దీరగ
వేణుగోప బాల వేగరార! 13

శిఖర దిశను గాంచి సూటిగ జేరగ
మట్టితోడ నింక మునిగి యుండ
మట్టినంత దీసె మర్మము లేకను
వేణుగోప బాల వేగరార! 14

పనులు జరిగె మిగుల పంతము తోడను
పట్టుబట్టి సేయ పనులు జరుగు
భక్తి గలిగి యుండ పనులు జరుగన
వేణుగోప బాల వేగరార! 15

మట్టినంత దీయ మరి గానుపించడె
మలుగునున్న యట్టి ముద్దు కృష్ణ
కృష్ణ కృష్ణ యనుచు కొలువగ నింకను
వేణుగోప బాల వేగరార! 16

చిన్ని కృష్ణ పిలచె చిరుహాసమునను
మాయ కృష్ణ నిలచె మర్మము గను
కృష్ణ మాయ దెలియ కాదువిక లేదుగ
వేణుగోప బాల వేగరార 17

కదలి నున్న వాడు కదలి యు రాదొకో
పైన నున్న వాడు బరుగు నొచ్చె
చెంత నున్న వాడు చేర నిలువ దొకో
వేణుగోప బాల వేగరార 18

భక్తి కలిగినంత బలము యదేనుర
భక్తి కలుగ కలుగ బలముహెచ్చు
భక్తిలేక యున్న ఫలమెట్లుండురా
వేణుగోప బాల వేగరార 19

మాయలోక మిదిర మానస చోరక
మాయనున్న వారి మలుపు(దిప్పు
మాయలేక యున్న మర్మము లేమర
వేణుగోప బాల వేగరార 20

మురికినంత దీయ మూచ్చట దీరగ
ముద్దుకృష్ణ డుండె ముచ్చటింప
వెన్నదొంగ యనచు వెఱ్ఱిగ యురువగ
వేణుగోప బాల వేగరార 21

దొంగదొరికె నంచు దొరలంతనికను
వెన్నయింత దెచ్చి విన్నవింప
విన్నపాలు వినగ వేళయ నింకను
వేణుగోప బాల వేగరార 22

గోపురంబుగట్టి గోడలు గూలవె
యిపుడుగాని మరల నెపుడు గాని
కూలిపోవ కతన జెప్పగ నింకను
వేణుగోప బాల వేగరార 23

పాలపొంగు వోలె పొంగగ సంభ్రమము
కూడ జనుల యంత గుడిని జేర
ప్రాణదానమిచ్చి పాలన జేయగ
వేణుగోప బాల వేగరార 24

ఒక్కరోజు లోన యొనరుగ గట్టగ
గుడిని యచట నింక గొప్పలోను
దేవదూత లంత తధ్యము రారాకో
వేణుగోప బాల వేగరార 25

కృష్ణవేణి కూడ కలవగ అబ్ధిని
సంద్ర సంగమంబు చోద్యమగును
తానమాడి నంత తరి యింతు రింకను
వేణుగోప బాల వేగరార 26

కోటిసురలు నిన్ను కొలువంగ వచ్చిరి
మాటలాడ వేర మువ్వగోప
గోపబాలనీకు కోప మదేలరా
వేణుగోప బాల వేగరార 27

వేణునాది నంత వెఱ్రిగా రారాకో
వేలకొద్ది జనులు యూపుతోడ
అలమంద లవిగో "యంబ" యనినిలచె
వేణుగోప బాల వేగరార 28

చుట్టి చుట్టి కృష్ణ చుట్టియు తిరుగగ
చిన్నికృష్ణ నడుమ చిందులాడ
కళ్ళు తిరిగి నంత కిల కిల నవ్వడే
వేణుగోప బాల వేగరార 29

భక్తి కలుగ నింక బంధితు డతడేగ
భక్తి లేక యున్న ఫలము లేదు
భక్తి చేత నింక బందిని సేయగ
వేణుగోప బాల వేగరార 30

మూడుకోట్ల సురులు ముద్దుగ గట్టగ
యొక్కదినము నందు యోర్మితోడ
గుడిని పూర్తి చేయరె గొప్పగా సురులును
వేణుగోప బాల వేగరార 31

మనిషి చూస్తినంత మాయము గాదాకో
గోపురంబు నింక గూలిపోయె
గోపురంబు లేక గుడియుంట చిత్రమే
వేణుగోప బాల వేగరార 32

ఎన్నిమార్లు గట్ట నదియును గూలదె
కతన మేది యెయ్యో కృష్ణ యింక
మదిని కలత దీర్ప హరి మా భాగ్యమె
వేణుగోప బాల వేగరార 33

అడుగో చిన్నికృష్ణ యంచును జూడగ
చూపినటుల యుండి జూడకుండ
జాలి జూపు చుండు చెంతక చేరగ
వేణుగోప బాల వేగరార 34

అంతరంబు దెలియ యతఃకరణమేగ
ఆత్మ సాక్షిగాదె యందరకును
నిర్మల మనము నిక నిండుగ కొలువగ
వేణుగోప బాల వేగరార 35

అంతఃకరణ నిలువ యన్నిటి వదలియు
యంతరంబు దెలియ నంతకంత
యంతరంబు దెలియ నదియును జాలదె
వేణుగోప బాల వేగరార 36

వాసుదేవుడొచ్చె వరముల నీయగ
కోరుకొనుము నింక కొండయంత
కొండ యంత గోర కొంచమే నదియును
వేణుగోప బాల వేగరార 37

కృష్ణకృష్ణ యంచు గోముగ నిలువగ
కర్మదొలగుచుండు కాతనైన
కర్మదొలిగినంత కరువును లేదురా
వేణుగోప బాల వేగరార 38

గోటితోడ నీవు కొండను నెత్తగ
గొల్లలంత జేరి క్రింద నుండ
సురలరాజు యింక సిగ్గుపడగ నింక
వేణుగోప బాల వేగరార 39

కోరికోరి వచ్చెకోరిక దీరగ
కూడ చుంటి నేమి కొంచెకృష్ణ
కోరకుండ నింక కోరిక దీర్చగ
వేణుగోప బాల వేగరార 40

బాటసారులింక బాధలు జెప్పగ
పాదమంటి నిన్ను బ్రస్తుతింప
ఫలమునీయకుండ పవళించ దగునెరా
వేణుగోప బాల వేగరార 41

వేద ఘోషలన్ని వినిపించ నికను
వేద మంత్రములను వినగ వింత
వేచియుండనేల వేదమూర్తియుగాగ
వేణుగోప బాల వేగరార 42

గొల్లలంత జేరి గొప్పగ గొలువగ
కోర్కెదీర్చ నికను కోరిరావె
కోరివచ్చి నంత కొరతయె తేదుగ
వేణుగోప బాల వేగరార 43

భక్తులంత జేరి బహు ముచ్చటగను
భజనజేయ మిగుల భక్తితోడ
పరవశించి యింక పవళింపగ నిక
వేణుగోప బాల వేగరార 44

పాలకడలి మీద పవళించు ప్రభువవే
మర్రియాకు మీద పసలువాడ
ఏగుదెంచ వేర యికనైన భువికి
వేణుగోప బాల వేగరార 45

దివిని వెలసి యున్న దివ్య పురుషుదేగ
భువుకి వచ్చి నిలచె భువన రూపు
భారమంత మోయ ప్రభువును గాదొకో
వేణుగోప బాల వేగరార 46

అతిశయంబు గాదు యందరకి దెలుప
అంతరాత్మ యౌర అసలు సాక్షి
యాత్మ తోడ గొలువ యమితా నందమె
వేణుగోపబాల వేగరార 47

బుధులు యింత జేరె బూజలు సేయగ
విధులు నిర్వహించె విదితము గను
వాలి వారి బమల వేగమే జేయగ
వేణుగోపబాల వేగరార 48

దేవదేవుడొచ్చె దివినుండి భువికి
వేడుకొనగ నింక వేగరావె
వేడుకలు జరుపగ వేడ్కతోడ నింకను
వేణుగోపబాల వేగరార 49

మెరిగొల్లయౌర వెన్నల దొంగయు
వేద వేద్యు డతడె వేదమతడె
విశ్వరూపు యతడె విశ్వము నేలగ
వేణుగోపబాల వేగరార 50

సాగరుండు మ్రొక్కె సాగిల బడియును
కృష్ణవేణి యింక గుడిని చుట్టి
మూడుకోట్ల సురలు ముచ్చటతో గొలువగ
వేణుగోపబాల వేగరార 51

దైవమనగ నెవరు దైవత మెయ్యది
సాయమిచ్చువాడె సమయమునకు
తోటివారికింక తోడుగ నుండడె
వేణుగోపబాల వేగరార 52

ఆలమంద జూడ యాలకించు నతడు
గోగణముల బ్రోచు గొల్లవాడె
గోల గోల నిక గొల్లలు బిల్వగ
వేణుగోపబాల వేగరార 53

అయ్యవారలొచ్చె యర్చన సేయగ
యాలకించవేర యాదమరచి
స్వీకరించవేల చిర్నవ్వుతోడను
వేణుగోపబాల వేగరార 54

పేదసాదలంత భయభక్తుల నిక
వేగవచ్చిరయ్య వేడ్క జూడ
వేలకొద్ది జనులు వినగను మహిమలు
వేణుగోపబాల వేగరార 55

చిన్నయడుగులేసి చిరుగజ్జెలతోడనూ
యందరిళ్ళకెళ్ళి యాదమరచి
ఊరివారి వెన్న యుట్టెక్కి తినగను
వేణుగోపబాల వేగరార 56

కోడలి పెదిమలకు కొద్దిగ రాయగ
మూతిమన్న వెన్న ముందు జూసి
దుత్తతోడ యత్త దుముకగ పైకిని
వేణుగోపబాల వేగరార 57

మన్ను మ్రింగె నంచు మరి బలరాముడు
తల్లితోడ జెప్ప తొందర పడి
నోరు జూపమనగ నోటిని జూపగ
వేణుగోపబాల వేగరార 59

నోరు జూసి తల్లి నోరు మెదపకను
అచ్చెరువును జెందె యనుభవమున
లోన మన్న యన్ని లోకముల గనగ
వేణుగోప బాల వేగరార 59

మాయ పిడింనత పర్మము మరువగ
పాలుత్రాగగోర పట్టుబట్టి
కొంగు చాటు నుండి కొద్దిగ త్రాగగ
వేణుగోప బాల వేగరార 60

హంస దీవి నింక యడుగుల వేయగ
కాకి హంస యయ్యె కరుణవలన
కోరుకారికింక కొంగున బంగరె
వేణుగోప బాల వేగరార 61

చేతనున్న వేణు చిన్నగ నూదగ
పశుచులంత జేరి ప్రక్కనుండ
ఆడిపాడి యుండ యది బృందావనమె
వేణుగోప బాల వేగరార 62

కృష్ణయష్టమొచ్చె కూడుకుని యింకను
కృష్ణుడొచ్చి నిలచె కోరినంత
కృష్ణయడుగులంగని కోరుకొనరెయిక
వేణుగోప బాల వేగరార 63

ఒక్క చేత వెన్న నొకచే వేణువు
పట్టుకొనియు నింక పరుగులిడగ
పట్టువడునె కృష్ణ పంతము కొందియు
వేణుగోప బాల వేగరార 64

ఒక్క యింటనుండు యొదుపుగ నింకను
యందరిళ్ళనుండు యందముగను
యూయలందు జూసి యూరుకొసదె నింక
వేణుగోపబాల వేగరార 65

మాటి ముడుచువారు ముచ్చట్ల వారును
చెప్పలేక యికను చెప్పువారు
కొంటెకృష్ణ గోల కారణమేమిర
వేణుగోపబాల వేగరార 66

గోరుముద్ద తినగ గోప్యమేమిర
వెన్నముద్దలోని వేదమేమి
పెరుగులోన యున్న ప్రతిభయు నేమిర
వేణుగోపబాల వేగరార 67

ఊరు యూరు నందు యుట్లను ఎగరవె
యుర్వియందు యింక యుచితరీతి
యుట్లు బట్టి జనులు యువ్విళ్ళు ఊరగ
వేణుగోపబాల వేగరార 68

ఉట్లకండుగింక వచ్చెగ ననుచును
యుట్ల బట్టినింక యూపుతోడ
వరుసగింక నిలువ వంతుల వారిగ
వేణుగోపబాల వేగరార 69

వేణుగాన లోల వేడుక జూడరా
గానలోల కృష్ణ కదలిరార
చిన్ని కృష్ణ రార చేయుత నీయగ
వేణుగోపబాల వేగరార 70

వేయి యిచ్చినంతి చింతలు దీరవే
పెదవి కదపినంత ప్రేమ యుబుకు
మనసు యందు దలప మరి రాకుండునే
వేణుగోపబాల వేగరార 71

ఆలమంద లవిగో యల్లరి సేయకు
గోప బాలురవిగో గోల యేల
వెన్నెముద్ద లివిగో వెనుకగ నేలరా
వేణుగోపబాల వేగరార 72

ఇటునటు నెటు జూడ యింపుగ గానమే
గానము విననింక గంతులేయు
గంత విప్పినంత గతమును దెలియదె
వేణుగోపబాల వేగరార 73

రక్ష రక్ష యనగ రక్షయు నీవయె
దేవ దేవ దేవ దేవ దేవ
కరుణ జూపరార కలియుగ మందున
వేణుగోపబాల వేగరార 74

కొమ్మ కొమ్మ నడుమ కోటి వెలుగులను
కనగ కనగ నింక కండ్లు చెమరు
కానలేక యున్న కన్నులు యేలరా
వేణుగోపబాల వేగరార 75

అందమైన గుడిని నందము నుండవే
సుందరుండు గాదె జూడనింక
ముందు ముందు జూడ ముద్దుగ నుండగ
వేణుగోపబాల వేగరార 76

కాళియ మద మణచిన ఘనుడ నీవెగ
ఆలమంద గాచు యాది దేవ
కలవరించితి గద కలగని నట్లుగ
వేణుగోపబాల వేగరార 77

చిరు కృష్ణ పనులు చెప్పగ నలవియే
చిన్ని కృష్ణ నింక చేరగలమె
బాలకృష్ణ జేర బహుదారు లవిగో
వేణుగోపబాల వేగరార 78

దుసలోని వెన్న కుడువగ నింకను
కుండలోని పాలు కారుచుండ
ఉట్టిమనూ పెరుగు యందగ నింకను
వేణుగోపబాల వేగరార 79

యల్ల నల్ల నరిగు యతివల యొద్దకు
మెల్ల మెల్ల నరుగ మర్మముగను
చల్ల చల్ల నరుగ చల్లని మనమున
వేణుగోపబాల వేగరార 80

యతులు గోరనింక నతులుగ నుండగ
పతియు నీవు గాదె పద్మనాభ
గొల్ల పడతులింక క్రీడలు సలుపగ
వేణుగోపబాల వేగరార 81

వలువలన్ని విప్పి యొడ్డునబెట్టియు
క్రీడలాడ నింక కొలను యందు
కొంటె బుద్ధి తోడ కోకల దాచగ
వేణుగోపబాల వేగరార 82

గోపబాలురంత గోవులగాయగ
గిరిని గిసినంత గీతదాట
గలరె దాటనింక గతులను దప్పెనె
వేణుగోపబాల వేగరార 83

కృష్ణలీల దెలియ కంటక మోదునే
కృష్ణమాయ దెలియ కలతయేల
కృష్ణ కృష్ణ యనగ కర్మము దొలగవె
వేణుగోపబాల వేగరార 84

తియ్యనయ్య పలుకు తేనెల బోసరె
నల్లనయ్య పిలుపు నందమేగ
చల్లనయ్య మాట చద్దిమూట యగాగ
వేణుగోపబాల వేగరార 85

వేణులోలు మాట వేదములుగాబోకో
వేణుగానమింక వినగరారే
వేదసార మేర వేణువునూదగ
వేణుగోపబాల వేగరార 86

వేంకటేశుడుండె యొకవైపునింకను
నారసింహుడడుగో నిక్కముగను
మరొకవైపు వ్రేడె మందహాసముతో
వేణుగోపబాల వేగరార 87

వేణుమాధవతడె వేదరూపుడతడె
వేణునాద సుతడె వేదనుతుడె
వేదియతడెయైన వేల్పుయునతడేగ
వేణుగోపబాల వేగరార 88

పూలవానగురిసె పున్నమిరోజుల
వేదముల జదువరె వేదులంత
విద్దెలన్ని జూడ వేడుకలమరగ
వేణుగోప బాల వేగరార| 89

సంతునిచ్చుగాదె సత్యముబల్కగ
సిరులనిచ్చు నుండు చింతదీఱ
మేలుచేయుచుండు మరిమరి నిలువగ
వేణుగోప బాల వేగరార। 90

వేణుదేవు గొల్వ వేకువనొత్తురు
వేణుదేవు జూడ వేగదెలియ
వేణుదేవు వినగ విసిపింపమొఱలను
వేణుగోప బాల వేగరార। 91

వేణుమాధవున్న వెరుపగ నేలరా
వేణుదేవుడున్న వెరపు యేల
వేణుగోపుడున్న వెతలును యుండునే
వేణుగోప బాల వేగరార| 92

వేణుగానపుదిగో వినరింక రారాకో
వేణునాదమదిగో వినరె యింక
వేణుబోధవినగ వేగిరపడరేల
వేణుగోవ బాల వేగరార। 93

వేణుమ్రోత వినరె విరివిగ నింకను
మాఘ మాసమందు ముచ్చటగను
పున్నమి దినమందు పున్నెము పొందగ
వేణుగోపబాల వేగరార 94

వెయి రత్నలుడుగు వేణునాదమిసెగ
జన్మతేక యుందు జగతియందు
ముక్తికల్గుచుండు మూడు జగతుల దు
వేణుగోప బాల వేగరార! 95

కోరివచ్చిరయ్య గోపాల బాలుడ
కోర్కెదీర్చరార గోపదేవ
కోరువారికింక కొంగున బంగరె
వేణుగోవ బాల వేగరార! 96

రాజ్యలక్ష్మి యడిగా రమ్యముగ బిలిచె
రాజ్యలక్ష్మి వేచె రమణు కొరకు
రాజ్యలక్ష్మి బిలువ రాజ్యల యిటకును
వేణుగోవ బాల వేగరార! 97

మాఘమాసమొచ్చె మందుగ బింకను
పెద్దలంత జేరి పెండ్లిసేయ
నిశ్చయించిరయ్య నిర్మల మనమున
వేణుగోత బాల వేగరార! 98

మాఘ చతుర్దశియు మంచిదినమనియు
వేదవేద్యులంత వేగిర పడ
పెద్దలంత జేరి పెండ్లి బనులసేయ
వేణుగోపబాల వేగరార 99

పెండ్లిపిలుపురాగ భక్తులు జేరరే
సాగరుండు పిఠ శల్లగాలి
వేంకటాద్రిరారె వేదు జూడగ
వేణుగోప బాల వేగరార! 100

సాగరుండు పొంగె చక్క నింకను
కృష్ణవేణి మురిసె కొండయంత
ఘోషవాకులంత ఘొల్లను చుడంగ
వేణుగోప బాల వేగరార! 101

హంస (అ) దీవి మిగుల యచ్చెరువందగ
దివ్వసీమ యింక తేజరిల్ల
ఆంధ్రదేశమంత యానందమొందగ
వేణుగోప బాల వేగరార! 102

దేవగణములన్ని దివ్యమునొందవె
దేవదూతలంత దరిని జేరె
యష్టదిక్కులింక యానందమొందగ
వేణుగోపబాల వేగరార 103

గోగణములు రేపె గోధూళియింకను
గోపబాలురంత ఘొల్లుమనగ
గోరుముద్దలెట్ట కోపమేలర వింక
వేణుగోపబాల వేగరార 104

తులసి పూజసేసి తుల్సిమాతకు వింక
పూలమాలవేయ పొంగిపోవ
వేణునాథున్నెచె వధువుకొరకు నింక
వేణుగోపబాల వేగరార 105

కుంకుమార్చనలును గొప్పగ జరుగగ
రాజ్యలక్ష్మి వచ్చె రమణుకొరకు
రమణు దొరికినంత రాజ్యము లేలర
వేణుగోపబాల వేగరార 106

వేణుగోప దేవు వేయమూడుముడులు
పరవశించె రాజా ప్రస్ఫుటముగను
కనులవిందు గాదె కన్నవారికికను
వేణుగోపబాల వేగరార 107

మేళతాళములను మారు మ్రోగగ నింక
దేవదుందుభులను దివ్యముగను
వేసెమూడుముళ్ళు వేణుగోపాలుడు
వేణుగోపబాల వేగరార 108

పెండ్లికూతు జూచి పరవశ్యు ద్రొక్కరే
పెండ్లికొడుకు జూసి పరవశించ
పెండ్లిజూచ్చువారె పెద్దలుగారొకో
వేణుగోపబాల వేగరార 109

వేలనోళ్ళ పొగిడె వేణుగోపాలుని
పొగిడె రాజునిగని పొంగి పోవ
దంపతులనుగాంచి దండము లెట్టగ
వేణుగోపబాల వేగరార 110

దండమెట్టి నింక దయాజూపుచు నుండ
చేతులెత్తి మ్రొక్క చేరదీయు
తలప తలప నింక తరియింప జేయగ
వేణుగోపబాల వేగరార 111

చిన్నమక్కెనపుత్రి చిన్నవాడను యేను
వ్రాసియుంటి నయ్య వేణుగోప
చేకొన కృతిగ నిక చేయెత్తి మ్రొక్కగ
వేణుగోపబాల వేగరార 112

వేణుగోపయాన వ్రాయగనెంచితి
చిన్న చరిత మొకటి తిన్నగాను
తప్పులున్న దిద్దదయచేత గోరెద
వేణుగోపబాల వేగరార 113

లక్ష్మియంచు బిల్వ అక్షణముగ దల్లి
నారాయణ యని యెను నాదుగురువు
శాస్త్రియంచు బిలువ సంతసమేనురా
వేణుగోపబాల వేగరార 114

చదువువారి కింక సద్గతులునుగల్గు
విన్నవారికింక వేదనేల
కన్నవారికికను కలతలుదీరవె
వేణుగోపబాల వేగరార 115



ఓం శ్రీ సిద్ధి విఘ్నేశ్వరాయనమః

# అయ్యప్ప శతకము

## రచనః– శతక కవి చి॥ల॥నా॥శాస్త్రి

శ్రీ హరిహర సుతుడవు నీవెగ
కువలయమున శబరిగిరిని కోర్కెలదీర్చన్
కరుణతో నిలచవె యచటను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 1

అయ్యల కయ్యయు నీవెగ
ఆదర్శమునను యతిథులను యలరింపంగాన్
నెలకొని యుండవె కోసల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 2

ఆదుకొనంగను రావయ
మము శబరిగిరీశ నీవె మమ్మలరింపన్
శరణాలు వేడమె వేగమె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 3

పులిపాలను మరి దెమ్మన
పులులను నిపలువె పురమున పుర్వజ జడియన్
తల్లిప్పులవదె దల్లియు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 4

ఇటు నుండి యెనే బిలువగ
ఎట నుండియొ బలకవె మరి వేగముతోడన్
సవరింపవె దీనుల మరి
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 5

ఈశ్వర శక్తియు నీవయె
శ్రీహరిశక్తియు గలిగియు శబరిగిరులలోన్
విలసిల్లవె తేజమునను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 6

ఉత్కంఠమునను గొలువరె
కోర్కెల దీర్చవె కరుణను కొండలనడుమన్
ఉత్పాదములను దొలగగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 7

ఊగాడుచు నుంటిమి యిల
దోగాడుచు నిక గిరులను దోబూచియనన్
ప్రాకృతము బ్రోవ ప్రాకరె
శ్రీ హరిహర సుతుడ-శరణు శబరినివాసా 8

ఋషులుందురందురు గిరుల
ఋషివైన నీవెగ నిజముగ ఋషివరప్రముఖా
ఋషివలె నుండరె భక్తులు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 9

ఎటుమాసిన నీరూపమె
ఎటునటు జూసిన వినబడు నెల్లరకును నీ
నామామృత గానంబును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 10

ఏమూలల నీవుంటువో
ఏకాసలనైన నిన్ను ఎరుగము వళమే
ఏకోనల గనుపింతువో
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 11

ఐదు గురుగ గూడి వత్తురు
యానందముగ నినుజూడ యయ్యప్పయులై
యప్పప్ప యనరె గాంచగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 12

ఒక్కరె గురువుగ నుందురు
ఒక్కొక్క గుంపును నడుపగ ఓరిమితోడన్
గురువులకు గురువు నీవయె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 13

ఓం శ్రీ స్వామి యశరణన
శరణము నిచ్చియు "యభయము" నన్నిదినిచ్చున్
స్వామిని శరణులు కోరరె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 14

ఔరా బాలకుడవుగను
బుట్టవె బ్రహ్మాండమును పాలనచేయన్
మార్చవె మనజాల మనములు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 15

కానల కోనల నుండెడి
కానవు నీవెగ నిజముగ కానలతేడా
మాకానల గాపాడవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 16

కర్పూర హారతు లీ
యగ కమల పొరలుతొలగవె యెరుకయు శోకన్
కరుణింపవె నిక భక్తుల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 17

ఖండ పరశువును బండల నుంచ
పంబళరాజును విధాత ప్రేరణ చేతన్
బెంచడె ప్రేమను విన్నావు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 18

గతియును నీవయె మాతును
జగతిని బ్రతుకగ విహితము జేయుము నింకన్
తలపోయమె ననుదినమును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 19

ఘనముగ గొలువరె పొగడుచు
కృతార్థులవరె యపార కృపయు గల్గన్
కోనల సాగరె నింకను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 20

చరణముల దాకినంతనె
శరణము నీయడె మనకును శబరి మలయుడున్
జాగేలదా నిక గోరగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 21

ఛవి శ్వేతను శోభింపవె
చలియును శోకను నడుపరె జనములు పొగడన్
చల్లగ దీవెన నీయుము
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 22

యురమును గదలదె సొప్పగ
“వంబ”యని బరుగుచు శబరిపర్వతమందున్
పావనుల జేయవె సాముల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 23

జరజర పారదె పంబయు
జలకము లాడియును చనరె చరణముల వ్రాలన్
శరణుల వినగనె పొంగడె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 24

పెంకలు బగులుచు నుండును
దినరాత్రములనియులేక దిక్కులు మ్రోగన్
బదునెట్టాంబడి యందున
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 25

తావుల్ దప్పియు యుండమె
రీవిని యుండవె గిరులను దప్పియు నీవున్
యాకలి దప్పుల దీర్చవె

శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 26
డబ్బులు లేకను సాములు
యిబ్బందులు పడుచునుండ యింపుగ ఈవే
అయ్యప్ప అనగ నీవయె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 27

ధుండికి సోదరుడవేగా
షణ్ముఖునకు సోదరుడవె సత్యము విరియున్
విలసిల్లవె శబరిగిరుల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 28

తధ్యమయా నీయునికియు
తధ్యమయా నీదురూపు తాలియు ఇలలోన్
తథ్యముగ యుండు యభయము
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 29

ధిమిత తక ధిమి త తతతో
ధిమిత తకధిమిత యనుచును తాళము వేయన్
తధిగిణతోం తోం యందువు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 30

దరిజేర్చుము నీభక్తుల
దరియును నీవెగ పరియగు ద్రోవన్ జూపన్
జీవుల రక్షణ జేయర
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 31

ధనమేలర నికమాటను
తపఃధనమె కలుగ తపముల తప్పకజేయన్
తపియించరె తపములకై
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 32

నందము కల్గుచు నుండును
ఆనందముతో మరికను యయ్యప్పవగన్
సుందరమూర్తిని కొలువరె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 33

పొంగుచు నుండను భక్తియు
పొందికనుండరె గిరిజన్ భజనలతోడన్
పొందరె కృపచే కరుణను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 34

ఫలమున కాశింపక నిక
బెక్కుడు భక్తిని మదినిక పెంపొందింపన్
గాయదె ఫలమిక గిరుఁన్
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 35

బాంధవుడవు నిక నీవయె
బంధుగులము మేమె నీకు పలువిధములు గాన్
బంధన గారణ మీవయె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 36

భగవాన్ శరణం భగవతి
శరణం యంచును బిలబిల శరణుల జెప్పన్
భగవాన్ నగువడు చుండడె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 37

మణిమాలను ధరియించియు
మణికంఠరుడవై వెలియవె మలయము లందువ్
మరిమాకు నిలవేల్పుగా
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 38

యాచకులమయ్యె మేమును
యాచించమె నినుకరుణను యాదాస్తులకున్
యానము సేయుచు కాసల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 39

రూపము గాదొకొ శక్తియు
నీరూపమె నిలచి యుండు నిర్మల మనమువ్
రూపము గాంచిన జాలుగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 40

లక్ష్యము నీవేగ మాకును
లక్ష్యమవగ నీదుచూపు లవలేశమువన్
లబ్ధిని పొందరె భక్తులు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 41

వందనము గొనుమ దేవర
మాకందరకును యభయము మన్నన నీవే
మంగళహారతి గైకొను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 42

శరణు శరణు స్వామి శరణు
శరణము గోరెమె గిరీశు సన్నిధిచేరన్
శరణము నీయవె ప్రేమను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 43

షణ్ముఖుని సోదరుడవే
షోడశ కళలంగలిగిన శబరిగిరీశా
సతతము చింతన జేయమె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 44

సంకుల సమరమున నుంటిని
సాధనము సేయగ బిరానసాగిక రా రా
సంశయమేలర నింకను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 45

హఠమేలనయ్యా నీకును
పిత మొదలిరా వదేల ప్రియమున నుండన్
యండగనుండవె మాకును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 46

క్షమియింపుము మాపాపము
క్షణ క్షణము దలపవె దేవ క్షోభయు దీఱన్
క్షేత్రము జేరగ వేగమె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 47

అయ్యప్ప యనగ చాలును
యయ్యల యయ్యయు పరుగిడు నాత్రము తోడన్
అవిశము దలచరె మదిలో
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 48

ఆదుకొనగ రావయ నిక
ఆలనపాలనము జేయర హరికలేకన్
ఆపద్బాంధవుడ వైనచో
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 49

ఇరుముడి తోడను వత్తురు
యింపుగ నిరుముడి యీయ యుద్వేగమునన్
సంబరమున నీవుండవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 50

మనసే మూల కారణమును
మనసును నిలుపర మనమున ముదముగ నింకన్
మనసును పలుచర రీతిగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 51

ఆరాధింపగ భక్తితో
అమితముగా నిక యనన్య యారాటమునన్
నాశ్రయ మీయదె ప్రేమను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 52

ఈశ్వరి తనయుడ నీవెగ
హరిహర సుతుడుగ వెలయవె హాసముతోడన్
ధనువు శరములతో నుండవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 53

మదగజమును వాహనముగ
గల్గియు కెంపుల పలువలు గట్టవె కార్తికన్
భూతము లణగగ ద్రొక్కవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 54

అందము గలిగిన సుందర
కొలువమె పూర్ణా పుష్కళ కుడియెడ ముండన్
శాస్త్రావ య్యను నిలువగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 55

ఉడుతా భక్తిని గొలువమె
ఊరూర నికను వెలియవె ఊతమునీయన్
ఉజ్జ్వల శక్తియు నీవయె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 56

పందళరాజువు నీవెగ
పదిరెండువత్సరములు బ్రతికియునింకన్
మాదేవుడవై విరియవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 57

తల్లిని యోదార్చగ నిక
తాపసిగమారి గిరులను తపమును చేయన్
కోవెల గట్టగ కోరవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 58

ఉకొప్పలురు ఎనిమిది మం
డియు, నాలుగు వేదములను వేపతైనన్
పదునెట్టాంబడి లోనివి
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 59

శాస్త్రములు రెండును జ్ఞా
నాజ్ఞానములును నవిద్య నిక విద్యగూడన్
పదునెట్టాంబడి పదునేడగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 60

పదునెట్టాంబడి నెక్కగ
పులకింతదె ఒడలు మిగుల పరవశమొందన్
మనిషిని దేవుని జేయువె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 61

గళమున మాలను నల్లని
వలువలు ధరించి నహపుము విడువంగానే
మొదలదె "మంగళ" రూపము
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 62

జీవములన్నియు నొకటిగ
దలచియు బ్రహ్మత్వమొంది తపమును జేయన్
కానల ఇరుముడి తోడను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 63

ఊష్మలశాస్త్రము దేవర
మాపాపములను సహింప మన్నింపదుగన్
మన్ననసేయవె మమ్ముల
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 64

పావన పంబయు యాతిగో
స్నానముచేయగ చెడుగులు సహయింపగాన్
జ్యోతిగ దర్శనమియవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 65

కార్తికంబున మాలను
వేసియు మండల వ్రతమును వేడ్కను జేయున్
అయప్పగుబడు చుండడె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 66

కులమత భేదము లేకను
జాతియు భాషల ప్రసక్తి సూచన నైనన్
లేకనె కొల్వబడవె నిక
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 67

"వావరుసామిని" ముందుగ
కొలిచియు ప్రసాదములను గొనగమ నింకన్
వావరుతోడను నిలువడె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 68

రక్కసి మహిషియు తపమున
బ్రహ్మను మెప్పించి వరము బొందిన యంతన్
యింద్రాదుల హింసింపదె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 69

రక్కసి మహిషిని దునమగ
అయ్యప్ప వెలసె హరిహరులకు యిలయందున్
పాదముల దరిమె మహిషిని
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 70

శాపముపీడిన మహిషియు
లీలావతిగ నిత మారిలక్ష్మముతోడన్
చేకొనగోరదే నతిగను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 71

దత్తాత్రేయగ నుండగ
సన్నిధినుండదె సపర్య జేయగ సతిగా
కామించ శాపమీయవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 72

మహిషిగ మారగ దెల్పగ
మారు శాపము నీయదె హరి మనిషిగ బుట్టన్
నీ శాపవిమోచన సేయగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 73

లీలావతి యును దెల్పగ
అయ్యప్పకు గలిగెపూర్వ యంహితమున్
సంకటమునుండె స్వామియు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 74

మకర (పు) సంక్రాంతి దినము
న "శరంకుత్తా" నడుమమ నాశరమున్నన్
యావత్పరంబు గాదనె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 75

బ్రహ్మచరియ మాదరణము
జేసెద ననుచును ప్రతినను జేయుటచేతన్
పెండ్లిని తప్పింప జూడవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 76

సంక్రాంతి పుణ్యదినమున
కాంతమలై నుండి జ్యోతిగ నగుపడంగాన్
మాళిగైపురత్తమ్మవె గద
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 47

ఏసంవత్సరమున శరము
ఆ శరంకుత్తాళిన యందు లేకనుయున్నన్
చేకొని యెదనని దెల్పవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 48

మాళిగైపురత్తమ్మయు నిక
తపమును జేయఁగ గజమును తరలియురాదే
లాభము లేదని మరలెగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 49

మణిమాల యుంట జేతను
మణికంఠుడనియు పిలువరె మనమున నిలువన్
నేర్వరె శాస్త్రము లన్నియు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 50

దేవతలను రక్షింతగ
దేవేంద్రుడు కట్టిసిడె దేవాలయమున్
కాంతామలై శిఖరమునను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 51

పీఠము నెత్తుగ నుండగ
పదునెనిమిది దేవతలును పడుకొని యుండన్
జ్ఞానపు పీఠము నెక్కవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 52

మణికంఠా యను మొఱవిని
పులులనుగూడియు విరవిర పురమును జేరన్
జ్ఞానము గలిగెదె రాజుకు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 83

శాపము మన్నించ యడుగ
రాజును రాజాజానికను రాజుగజేయన్
కోరవె మిక్కిలి ప్రీతిని
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 84

మరణించు నంతవరకును
దర్శనమిచ్చియు మరికను తదుపరి గూడన్
జన్మయులేకను గోరదె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 85

సుభరాజు కట్టినట్లును
పదునెనిమిది మెట్లతోవ పరవశమందన్
నిర్మింప గోరవె గుడియు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 86

గణపతి షణ్ముఖ సోదరు
లకు ముందుగ సన్నిధానము తేర్పరుపంగన్
మాళిగైప్పురత్తమ్మ నుంచవె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 87

వావరు కడుత్త కడురవ
సాములకు పదుల దిగువను సన్నిధులమరన్
కుంభాభిషేకము జరిగె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 88

కుంభాభిషేక శరణము
న పరశురాముడు ముదముగను ప్రతిష్ఠింపన్
సురరాజును తోడుండదె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 89

తపమున నుండు సమయమున
దర్శనమును గోరువారు తప్పక గానరే
బ్రహ్మచరియ వ్రతంబును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 90

పులిపాల కొరకు సామియు
యిరుమడి తోడను యడవికి యేగిన విధమున్
యటులనె భక్తుల గోరదె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 91

మున్ముడి నుంచరె ముద్రకెం
కాయలు పూజాపరిమళ కర్పూరంబుల్
అందుగు వేసిన కాన్కలు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 92

గణపతికి సూరకెంకాయ
యు పురత్తమ్మకు పసుపును యింకొక కాయన్
రేవికల గుడ్డను యుంచరె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 93

మరియొక కెంకాయను వే
సి ''శరంకుత్తిన'' బగులగ [illegible] చేయన్
విడియొగ మున్ముడి యనరే
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 94

పిన్నడి యందున యుంచరె
సాత్త్విక యాహారము నిక సమయోచితమున్
రెండు కలవ యారుముడవదె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 95

మకరపు సంక్రాంతి దినము
తిరువాభరణములను దెచ్చితప్పక యలంకరిం
పగ గోరవె రాజాపును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 96

శరమును వదలగ నిలచిన
చోటను యాలయము గట్టచెప్పవయింతన్
యంతర్ధన మగవె నిక
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 97

శరములు యైదుగ మారగ
యైదు స్థలముల బడగను యాలయముల నికన్
నిర్మించె పాండ్యరాజును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 98

తిరునాభరణముల శిరమున
దెచ్చియు సామిని యలంకృత్తునిగను జేయన్
మోక్షము నీయవె రాజుకు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 99

ఎరిమేలిని బోయగ నిక
పూర్ణా పుష్కలాంబ [illegible]
అర్యన్ కావున మరియును
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 100

బాలకు కళత్తు పులిలో
అచ్చన్ కోవెలను వృద్ధునకు నిక శబరిన్
సన్యాసిని పూజింపరె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 101

తిరువాభరణముల పెట్టెల
కానలజాటగ భద్రముగ గొని తెచ్చుటలోన్
సాయము నీయుది గాదటు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 102

తిరువా భరణముల పెట్టెను
జూడగ తనువు పులకించు చుండదెనింకన్
తాకగ నిక ధన్యులవరె
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 103

ఆభరణాలంకృతునిగ
యయ్యలకయ్యయు నగుబడు ఆనందముతోన్
ఆశీర్వదించ రాడే
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 104

ఈశ్వర నిచ్చా శక్తియు
విష్ణు క్రియాశక్తి గలిసి వెలసె నికనిలన్
జ్ఞాన శక్తి యగు సామిగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 105

ఆశయు నీవయె మాకును
ఆశాపాశములు లేక యద్దరి జేర్చన్
ఆనందాశ్రువు ధారలగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 106

మాలను ధరించి సంతసను
మాయమవవె మాయ మోహములు నికలేకన్
మాయవషె దుర్గుణములు
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 107

శరణము గోరిన వారిని
సన్నిధి జేర్చునతడె నిక శంకయులేకన్
సర్వమతడె సన్నిధి జేరగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 108

శరణు శరణు శరణ మయా
శరణము నీయుము శుభములు గలుగగ నెప్పుడున్
శరణములు జెప్పుమె నింతను
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 109

కాంతిపుష్పై నుండి వచ్చెడి
జ్యోతిని జూడగ కనులను చెపరవె నింతన్
ఆనందాశ్రువు రాలగ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 110

వ్రాసితి శతకము నొకటియు
చేకొను దేవర కరుణను చిర్నగవులతోన్
ప్రేమను బ్రోవగ గోరెద
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 111

చి॥ల॥సౌ॥ శాస్త్రిని చిన్మకె
న స్థిర వాసుద శివులకు గలిగ్గియుంటిన్
భారద్వాజస గోత్రుడ
శ్రీ హరిహర సుతుడ శరణు శబరినివాసా 112



ఓం శ్రీ సిద్ధి విఘ్నేశ్వరాయనమః

# ఆంజనేయ శతకము

## రచన:- శతక కవి చి॥అ॥నా॥శాస్త్రి

శ్రీ పవన సుతుడును చినమ్మక్కనను నిల్వ
చిన్నగట్టుమీద చింత దీర్చ
"ఆంజనేయు" సేవ అమృతభాండమె కాగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ 1

శివసదాశివుడు చిత్తమెట్టియు ఇంక
స్వామి నింక గొలువ సాటిలేక
స్వర్గమికను జేరె సాధించి భక్తితో
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ 2

క్రమిదలింక వెలుగ ప్రముఖమై యుండగ
భక్తి భావమింక ప్రస్ఫురింప
భావ వేగమందు బాధలే తొలగగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 3

అంజని సుతుడతడె ఆంజనేయుడతడె
వాయునందనుడింక వరసుతుడేగ
కోరి నమ్మి గొల్వ కోరిక సిడేర్చు
చిన్న మక్కెనపు రి చిన్ని హనుమ! 4

చెర్వునిండ నీరు చేరంగ నిండుగా
గట్టు తెగగ నింక పట్టు సడలి
గుంట నున్న యూరు గునగున మునుగునా
చిన్న మక్కె నప్పురి చిన్ని హనుమ! 5

పెద్దలంత గూడి పెద్దమాటలు చెల్ప
భక్తి లేక యింక ఫలము యేది
నేను తోడ బక్క సిన్నమాటలు గూడ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 6

నీట మునుగనింక నీవె దిక్కనగనూ
పాపము జేసి యింక సాయపడగ
మదిని సామినింక మరచునా ఎవ్వడైన
చిన మక్కెన పురి చిన్న హనుమ! 7

విప్రులు మిగులగూడి విద్య వీగగ నింక
ఫలము ఏమి యింక భక్తి లేక
మర్రి క్రింద గూడి మాయమాటలు ఏల
చిన్న మక్కెనప్రురి చిన్న హనుమ! 8

అసురులంత వచ్చె అక్షణము నె నింక
సూక్ష్మ బుద్ధి యుంచు సురలు పొగడ
పొగడినంక మిగుల పొంగగ మిగులుగా
చిన్న మక్కెనప్పురి చిన్ని హనుమ! 9

ఊరుకొక్క గుడియు నుమ్మడి నుండగా
అత్త పోరులాగ నమిత పోరె
ఊరు పొమ్మ్రతినగ నురుకురికియు
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 10

ఉసురుయుండు వరకె నూపిరాడుచు నుండు
ఉసురు పోయినంత నూపిరేది?!
ఊపిరున్న వరకె ఉడుత భక్తిని జూత
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 11

పానకము, వడపప్పు పట్టుగ నుంచియు
దివ్వెనెట్టి మిగుల దీపముంచి
భక్తితోడ నింక పాదము లంటగ
చిన్న మక్కెన పురి చిన్న హనుమ! 12

చిట్టి చీకటందు చిరు దీపమౌడేగ
నిండుకొల్వు నందు నేర్పరతడే
లంక నింక దాట లవలేశమునకు నింక
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 13

ఉదయమింక లేచి ఉసు-ను నిల్పగా
వేడుకొనుమ నతని వేడ్కతోడ
ఉదయ రాగ మింక నూపిరి పోయగా
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 14

కొదువ ఏది మనకు కొండంత అండగా
ఆంజనేయుడుండ నాపద దు
ఆదుకొనగ నతడె ఆదరింప నతడె
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 15

అంగలి ఘటించి ఆంజనేయుని మ్రొక్క
ఆశిసులిక నిచ్చు అప్పుడతడె
మనసు నందు దల్చు మరి సాయము రాగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 16

భక్తి కుందు పట్టు దక్కి సేవిరా!
ముక్తి సాధన మిక భక్తి యేగ
భక్తి లేక యున్న పరమ పూజ్యముగాగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 17

ఆశ దీరు చుండు ఆశను జంపగా
కొసరి కొసరి తినగ కొసరు ఏది?
కొసరి నంత దీరునా కొండంత ఆశయు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 18

ఊసురుయున్నపుడె నుపకార మిక సేయు
పేరు నిచ్చి పోడె పెద్దగాను
ఉసురు పోయినంత ఊరేగ ఫలమేమి?
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 19

తనకు పొదువు యింక తనవారికి మదుష్ఠ
ఊరికింత మదుష 'ఉర్వి' మలుప
ఊర్లు శాంతియుండ ఉర్వి శాంతియు జెందు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 20

కోట్లపడగ కత్తి కోరినా దొరకునా
శాంతి, సుఖము లింక శాంతి జెంద
జీవకోటికింక చేయరా సేవయు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ 21

సేవయందు మిగుల చిత్తము బెట్టగ
శాంత చీకటింక కదలి పోవు
చిమ్మ చీకటందు చిరుదీపమును కాగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 22

ప్రేమ,భక్తి కింక భేదము లేదుగా
ప్రేమ తోడనింక పిలువగాను
పలుకవేర సామి పలుమారు పిలువగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 23

అంజనేయుడడుగో హనుమంతుడదుగో
మారుతి తనయుండు మహిమజూపు
వాయునందనుడదె వరదుగ కాచింప
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 24

రామభక్తుడతడె రణమున బావింత
రామ రాజ్యమేల రాముడేగ
రామరథు మిగుల రంజిల్లుచును యుండ
చిన్ని మక్కేనపురి చిన్ని హానుమ| 25

ముత్తయిదువలకును ముచ్చట దీరగా
విధవలకును గూడ పింతగొలుప
పిల్లలకును నింక పెద్దగా నుండగా
చిన్న మక్కేనపురి చిన్ని హానుమ| 26

పాగునీటికొరకు సాగిలబడి నింక
నీరుసాగుచుండ నిర్మలముగ
నీరు పారుచుండ నిలబడి పండగా
చిన్న మక్కేనపురి చిన్ని హానుమ| 27

అరువు బుద్దియింక తరుణ చేటున్నుగాదె
పాడుబుద్ది మాని బ్రతుకుమింక
అరువు, అరువు యుంచు అవురాత్రురు మననేల
చిన్న మక్కేనపురి చిన్ని హానుమ! 28

ఉదయ కిరణములను ఉజ్వల శక్తితో
తగులనింక మిగుల తన్మయముంటె.
పాదమంటునింక పాతకములు బోవ
చిన్న మక్కేనపురి చిన్ని హానుమ| 29

భక్తులంత మిగుల భక్తితో గొలువంగ
భక్తిభావమింక ప్రబలమవగ
ఆంజనేయభక్తి ఆదర్శమును గాగ
చిన్న ముక్కనపురి చిన్ని హనుమ! 30

గాలివాన రాగ గజగజలాడగ
వెళ్ళిచూడ లోన వేడిగల్గ
దీని కథన మింక తెలియుంగవశమా నే!
చిన్న ముక్కనప్పురి చిన్న హనుమ! 31

గుడిని చుట్టు చంద్రు కూడికూడి మిగుల
గుడిని చుట్టినంత గుర్తు దెలియు
గురుతు దెలిసినంత కోర్కెలె దీరగా
చిన్న ముక్కనపురి చిన్న హనుమ! 32

ఆకుపూజ సేయ ఆశ దీరుచునుండు
కోరి గొల్చినంత కొరత దీరు
కోరు 'హనుమ' నింక కొద్దిగ సేవైన
చిన్న ముక్కన పురి చిన్న హనుమ! 33

చనువు, కుంకుమలతో పచ్చగ పూసియు
గడపదాటనింక గండలేదు
చేతినందివచ్చి చేయూత నీయగా
చిన్న ముక్కనప్పురి చిన్న హనుమ! 34

గుడిని జుట్టుచింక గుంపులతోడనూ
భజన చేయుచేయు భక్తితోడ
తోడు నీడ నతడె తోడుగనుండగ
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 35

గలగలమని చెరువు కళకళలాడగా
బిలబిలమని నీళ్ళ పిల్లలెగుర
భక్తిభావమింక పెరుగగ మిన్నగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 36

గుడిమొగురుతుతాగ గురిగను జూడగా
ధ్వజస్తంభమింక దాటగాను
సకలజనులకును సంధియు గూర్పగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 37

స్వామి సేవజేయు సాన్నిధ్యమందున
మదిని మొరయు సామి మర్మముగను
మర్మమింక దెలియు మరియేమి లోటురా
చిన మక్కెన పురి చిన్ని హనుమ! 38

ఉగ్రరూపమింక ఉగ్రముగ నుండగా
సాధురూపమింక చల్లగుండ
చేతులెత్తి మ్రొక్క శివుడగుబడుచుండ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 39

అడుగో, అల్లనడుగో ఆంజనేయుడుగో
అడుగుమింక నతని ఆదరించి
అడగకుండ నింక 'అమ్రయు' నిచ్చునా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 40

సంజీవినిక తేగ సాధనతోనిక
స్వార్థరహిత భక్తి సామిభక్తి
'రామదాసు' భక్తి 'రామశక్తినే' దాట
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ। 41

పొగడ,పొగడ మిగుల పుష్కలముగ నిక
దాటలేదే లంక తక్షణమిక
సీతజాడ దెలియ చిత్రమెట్లుయగునో
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ। 42

చెఱువునీటికెళ్ళి చేయెత్తి మ్రొక్కగా
చిన్నదండ వెంకటి చెమ్మగిల్ల
చిన్నకెంబు స్వరు చెదరగ నింకనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 43

చెవులుపట్టియింక చిన్ని గుంజిలు దీయ
రామ-రామ-యనగ రామ జపము
చెవులబట్టి వినగ చేయూతనీయగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ। 44

ఒక్కసారి బిలువ వశ్యాగ నుండనూ
రెండుమార్లు బిలువ రెప్పలాడ
మూడుమార్లు బిలువ ముచ్చట దీరగా
చిన్న మక్కెనపురి చిన్న హానుమ! 45

అంజని సుతు దల్ప ఆర్భాటమేలరా
అంజలించి మిగుల హారతీయ
చాలునదియెవింక పార్థకతను జూప
చిన్న మక్కెనపురి చిన్ని హానుమ! 46

నూనెదీపముంద నోముతే పండగ
నేతిదీపముంచ నెమరు వేయు
దీపమందె నింక దేవునిగాంచగ
చిన్న మక్కెనపురి చిన్ని హానుమ! 47

భూతప్రేతములను భూస్థాపితము గాగ
మోసకారులంత మోసపోవ
మంచిచెడులనడుమ మరి భేదము దెలియ
చిన మక్కెన పురి చిన్ని హానుమ! 48

నమ్మకమ్ముంటిమయ్యా నల్గురిక దెల్పి
మహిమలెన్నో నింక మరిక జెప్పి
ఆదుకొనిగ రాడె అంజనేయుడనగ
చిన్న మక్కెనపురి చిన్ని హానుమ! 49

రామచరిత జెప్ప రయమున వచ్చుగా
సీతపలుకు వినగ చిలిపినవ్వ
రామమాట నింక రతనాల మూటవ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 50

సంస్కరించుచుండ సాష్టాంగపడగనూ
చేతులెత్తి మ్రొక్క చేసుకొనును
చూచువారలకును చోద్యంబుగాగను
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ 51

ఆర్తనాదమవగ ఆదుకొనుచు నుండు
కేలుమోడ్చి నింక కేక వేయ
అభయహస్తమిచ్చి అండయు నుండగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 52

రామబంటు యింక రఘుసేవకుడు గాదె
నమ్మి గొలిచె నింక నమ్మకముగ
నమ్మి గొలువ, 'పిలచి' నడిపించు నావనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 53

'పుట్టు' నుండి మిగుల పురుషుడేగ
వజ్రశరీరమవదె వజ్రము చేత
నగము లంటి యికను వరపుత్రు డవగనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 54

మ్రొక్కు మ్రొక్కినంత మ్రొక్కు దీర్చుచుండ
దిక్కు ఏదియనగ దిశను జూప
రక్ష రక్షయనగ రక్షించ మిగులుగా
చిన్న మక్కినపురి చిన్ని హనుమ! 55

చిన్నతనము నందె చిలిపి చేష్టల జేసే
పెద్దయపుడు జేయు పెద్దపనుల
పిన్న పెద్దలకిల బెద్దగ నుండగా
చిన్న మక్కినపురి చిన్న హనుమ! 56

రాము కొరకు బుట్టి రామబంటుయు గాగ
రామ నామ మింక రసము గాగ
రామ మహిమ దెలియ రమ్మని పిలువగా
చిన్న మక్కినపురి చిన్న హనుమ! 57

ఈశ్వరాంశ గాగ ఈశ్వరుడు యతడె
బాహుబలుడుగాగ బహుళశక్తి
బ్రహ్మచారిగాగ బ్రహ్మమూర్తి యతడె
చిన్న మక్కిన పురి చిన్న హనుమ! 58

ముకుళిత కరములను మోక్షమునకు గుర్తు
ముకుళ హస్తమింక ముక్తి నీయ
ముకుళ హస్తములతో ముందుగ మ్రొక్కగ
చిన్న మక్కినపురి చిన్న హనుమ! 59

పంచరంగులనిక పట్టుగ వేసియు
పట్టుపంచె గట్టి పదము పాడి
పట్టు విడువ కింక పట్టుగ ప్రార్థింప
చిన్ని మక్కెనపురి చిన్ని హనుమ! 60

తమలపాకు తోడ తప్పక నర్చింప
తరుణమిదియెనయ్యా తప్పకుండ
ఆకుపూజ చేయ ఆశల దీర్చగా
చిన్న మక్కెనపురి చిన్నిహనుమ! 61

సేవ చేయచేయ చింత దీరుచు నుండ
మనసునింక నిలుప మహిమ జూపు
ఆత్మశక్తి కన్నా అధికము ఏదయా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 62

రఘు, సుగ్రీవులకును రాణించి సేవయు
హనుమ జేయు మిగుల అబ్బురంబె!
నరుల, వానరులకు నడుమ సంధిని గూర్చ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 63

లంక నింక దాటి లంకేశునింగాంచె
సీత జాడ దెలిసె చిటికెలోన
ఆనవాలు దెచ్చి ఆత్మ రూపునకీయ
చిన్న మక్కెనపు రి చిన్ని హనుమ! 64

రామ కనుల నుండి రక్తమె కారగా
హనుమ గుండె చెదర అంతులేక
సీత కథను వినగ చింతిల మిగులగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 65

సంధి చేయగోరి సాగగ ముందుకు
రావణుండు గోర రణము నింక
ఎవరి కర్త కింక వారె కర్తలు గాగ
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 66

రామ చరితమింక రమ్యముగ జదువ
హనుమ వ్రాలుచుండ నచ్చటింక
హనుమ నింక జూడ అనుసరణీయమే
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 67

"హనుమ చాలిస" నిక అది మరచి జదువ
'హనుమ' ఆడుచుండం అంతులేక
భారతీయ నింక అనుభూతియును కాగ
చిన్న మక్కెన పురి చిన్న హనుమ! 68

శత్రువు లేక జేయు సపరివార సేవచే
సంతస కలుగ నింక సంశయంబె
సర్వసేవ యింక స్వామి సేవయె గాగ
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 69

తోక మూక తోక తుదకు వారధి గట్టి
స్వామి భక్తి జాట సాత్వికముగ
వారధి నిక దాటి వశపర్చుకొనె లంక
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 70

వాలమునిక నెత్తి వంటి చేతిని భీమ
రెండు చేతలనిక రెండు రెట్ల
హనుమ నింక వేడ ఆలింగనము సేయ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 71

తులసి దాము వేడ తుదకిక హనుమనూ
చూపగోర వాని సూక్ష్మముగను
జూప 'రాము' నింక సూక్ష్మత దెల్పియు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 72

సీత లేగి తరిని చెరియొక కాలును
హనుమ, లఖమలకును అందజేసి
సేవజేయగోర శ్రీరామ చంద్రుడూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 73

శివుడు కోతినింక శ్రీరామునకు నీయ
పెద్దయగు వరకును పెంచి పెంచి
'సుగ్రీవు' నొద్ద చేయుచుండ గోర'సేవ'
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 74

సీతవింక వెదుక చిట్టడవుల దూరి
చిత్రకూట మింక చేర వేగ
హనుమ గలియ వారి అమృతంబునుగాగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 75

అంబుధీ నిక దాట అడ్డుపడగ 'సురస'
నోటినుండి బోవ నోరు విప్ప
'సింహిక' నిక జంప సింహనాదము చేసి
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 76

లంక నింక జేరే 'లంకిణి' నొప్పించి
సీత జాడ దెలియ చిటికెలోన
లంక నింక గాల్చి లంఘించి మింగులుగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 77

ఉసురు బాయనింక ఉరిపోసు కొన తల్లి
రామ కథను జెప్ప రమ్యముగను
హనుమ' అనవాలు అమ్మకునీయగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 78

సీత మానసము నందు చిరుదివ్వె వెలుగగా
'అహితుడు' అమరుడయిన అమ్మయింక
సీత పాదము కడ చిందులాడ మిగుల
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 79

పండ్లు తినగ నింక ఫలముల కోయగా
రాక్షసాధములు రక్కవింక
వృక్షములను విరిచి వ్రనుకలె తీయగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 80

మంత్రుల పుత్రులనిక మట్టును బెట్టగా
'జంబుమాలిని' నిక చంపగాను
పంచసేనపతుల చంపగ "పైకిని"
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 81

అక్షయు పుత్రు నింక అర్పణమును జేయ
ఇంద్రజిత్తు యింక యిరుకునపడ
బ్రహ్మ అస్త్రిమునకు బద్ధుడు కాగనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 82

హితము జెప్ప హనుమ యికిలించి దశకంఠు
ఎదురు బలులు బల్కి హీన పరచి
తోక కింక నిప్పు తొందరగను బెట్ట
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 83

ఇంటి కొక్క రవ్వ యింపుగ నంటించి
లంక యంత కాల్చె లాఘు చేత
విభీషణుని గృహమును విడిచియు నింకనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 84

గుర్తు లెన్నో చెప్పి గురిగను హనుమంతా
'చూడామణిని' యిచ్చె చోద్యములర
ఆ వాళ్ళు ఎన్నో అంతులేకను దెల్ప
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ' ౬౫

సీత దర్శనంబు చింతయు దీర్చగా
పాదయుంట నిక పరవశించె
మాటలాడినంత మనసె వికసితమవ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! ౬6

ఆనవాలు జూప ఆలింగనము చేసి
హత్తుకొనగ రాము అక్కు నింక
"హనుమ"! యింక నీవు ఆత్మీయుడనగనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! ౬7

వారధి నిక గట్టె వానర గండుతో
కొండ గుట్ట లేయు గొప్పగాను
సంద్రమింక దాట సాహసించి యికను
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! ౬8

వాయువేగ శాలి వనరాశి ధీశాలి
అగ్నియంత కలుగ అమిత శక్తి
రావణాధములను రణమున జంపగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! ౬9

బ్రహ్మదత్తమైన బాణము విసరగా
మూర్ఛ చెంద లఖను మూర్ఛేమటల
హనుమ గ్రుద్దు గ్రుద్ద అరవ రావణుడికి
చిన్ని మక్కెనపురి చిన్ని హనుమ! 90

హనుమ లేవ 'లఖను' అద్భుత సేవచే
రక్కసులను దునిమె రాశులవలె
హనుమ భుజము లెక్క ఆరామ లఖనులూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 91

బ్రహ్మ అస్త్రమింక పదునుగ వదలగ
'ఇంద్రజిత్తు' మిగుల 'ఏత్తు' తోడ
మూర్ఛ జెంద లఖను మోహములు వాడగ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 92

సంజీవగిరి నింక శక్తితో లేగనూ
లక్ష్మణుడు లేవ లక్షణముగ
హనుమ శక్తి దెలిసి ఆశ్చర్యమందగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 93

"కాలనేమి" నింక 'కాలుని' కడ కంప
"ధన్యమాలి" నింక ధన్యుజేయు
భరతాదులింక పరిచయమవగనూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 94

తనదు శక్తి గాదు తన సామి శక్తియే
'రామపాద' ముంక రక్ష నిచ్చు
నంచు 'హనుమ' దెల్ప ఆనందమును గల్గ
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 95

హనుమ లంక దాట అతివేగము గను
'చేప నోటి యందు చెమట పడగ
'మకరధ్వజుడు' బుట్ట మరి రక్కసులు పెంచ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 96

అన్న, దమ్ముల నిక అహి రావణుడు దాచ
హనుమ ఏగి నటకు అతని దునిమి
'మకరధ్వజు'ని కిక మరి రాజ్య మీయగా
చిన్న మక్కెనపురి చిన్నిహనుమ! 97

'పవన' సుతుని వలన పట్టాభిషేకమూ
విభిషణునకు జరగ వింత యానే
హనుమ కరుణ దెలియ అమిత భక్తి కలుగ
చిన మక్కెన పురి చిన్ని హనుమ! 98

హనుమ నింక గోర ఆ రామ చంద్రుడూ
'సీత' కింక దెల్పి చెచ్చెర వేగ
హనుమ శక్తి దెలియ ఆనంద మందగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 99

హానుమకీయ సీత ఆశీసుల నిశను
సీత బొగడ నింక చిత్రము యౌనే
పొగడ 'మాత' యింక పొంగగ హనుమయా
చిన్న మక్కెనపురి చిన్నిహనుమ! 100

రామ లఖను తీయు రమణీయ బహుమతుల
సేవ జేయు నింక సేద దీర
రామ భక్తి మనము రంజిల్లగా నిక
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 101

హారమీయ సీత ఆంజనేయునకును
'పళ్ళ' తోడ కొరికి పాడు చేయు
కతనమింకక యుతుంగ కడు కాఠిన్యముగను
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 102

రామ, సీత, లఖను రాళ్ళలోనను ఏరి
ఒక్క రాయి నైన ఒనరు గాను
వారు లేని రాళ్ళు 'వట్టి' రాళ్ళె గదా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 103

చూపగలరె వార్ని చోద్యము లేకను?
ఎచట నైన గాని ఎప్పుడైన
అడుగ విభీషణుడును ఆత్రముగా నిక
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 104

రామభక్తి యుండ రాముఁడచట యుండ
రామనామమేగ రమ్యమంబు
రాము లేని రాయి రత్నమెట్లగునది?!
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 105

గుండె నింక చీల్చి గుర్తును చెప్పగా!
"హనుమ" భక్తికింక అబ్బురపడి
రామ, సీత లక్ష్మను రాతి గుండెను జూడ
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 106

పడిన మఱుదులికను వనరుగ గూడియు
రామ 'సేవ' నుండి రయముమునింక
ఆత్రుత నిక జెంద హనుమను వదలింత
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 107

ఆంజనేయు సేవ ఆదిశంకర సేవ
హనుమ కుండు భక్తి అమిత రక్తి
'హనుమ' లేక యున్న ఆరాము డుండునే
చిన్న మక్కెన పురి చిన్న హనుమ! 108

పట్టి నొకటి జేసి పట్టుదలతో నిక
హనుమ నింక మిగుల హాడల గొట్ట
'రాజముద్ర' వేయ రాజసభను నింక
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 109

ఏమి మిగిలి యుండు యింక యని దలప
'ఆవులింత' సేవ హనుమ కియ

'చిటికె'ల పనికిక చిన్న ముద్రను వేయు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 110

నామ సంతకముతో రాజముద్రను వేయు
వదిన మరుదులింక వహ్వాయనగ
'సేవ' జేయు హనుమ చిటికెలు వేయుచూ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 111

హనుమా కూరుచుండ ఆసీనుడై యుంక
రాముని నెదుట నింక రక్తి గట్ట
సీతగోరి మిగుల చూచు ఏకాంతము నిక
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 112

హనుమ నెక్కె నింక అటక మీదకు నింక
ధ్యానమందు యుండ తపము వలన
'చిటికె' లాగకుండ చిటికెలె జేయగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 113

నోరుమూత పడక నోరు తెరచి యుండ
అందరింక జూసి అదిరిపడగ
గురువు కింక దెలియ గుర్తింత నాపద
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 114

అందరు ఇట నుండ 'హనుమ' ఏడంచునూ?!
గురుదేవులనడుగ నింక 'గుడ్లు' చేల!
పైన నుండె ననగ పై కప్పునను నింక
చిన్న మక్కెనపురి చిన్న హనుమ! 115

'హనుమ ! యంచు బిల్వ ఆతురతతో నిక
చి నగవులు యింక చిందులాడ
చిటిక లాగెనింక చి హాసము నడుచు
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ' 116

హామన్న యంచు మిగుల ఆరాటమును తగ్గ
అందరిక యుండ అ రి యింక
'సీత' వచను గోర చేయ రాముని సేవ
చిన్న మక్కెనపురి చిన్నిహనుమ! 117

చిన మక్కెన పురిశ చిన్నిహనుమ యింక
అందుకొనుము యింక ఆశదీం
చిన్ని శతక మొకటి చేతగాకను వ్రాయ
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 118

రాసి యుంటివయ్య రాఘవేంద్ర కరుణ
మూలరాముడింక ముచ్చటుండ
హనుమ మహిమ దెలియ నందర కింపుగా
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 119

చిన్న మక్కెనపురి చిన్నవాడను యేను
శాస్త్రి యన్నపేరు చెలగువాడ
శివ, సదాశివులకు చిన్న వాడను యేను
చిన్న మక్కెనపురి చిన్ని హనుమ! 120



ఓం శ్రీ సిద్ది విఘ్నేశ్వరాయనమః

# గంగమ్మ శతకము

## రచనః— శతక కవి చి॥ల॥నా॥శాస్త్రి

శ్రీగపురమ్మవు నీవయే
గంగవునీవయె గదమ్మ గతులున్ మార్చన్
అగడముసేయగ కోరుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 1

ఊగవె కోవెలయందున
ఊగమె తీరని వెతలతొ యూరిని నింకన్
వేగమెబాధలు దొలగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 2

సాగరె జనులును గుంపుగ
పొగడుచు పెక్కుడు మహిమలు పరిపరి విధములతో
తగవుల దీర్చగ గొప్పగా
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 3

నగుమోముతొ ననుదినమును
నగుపింపవె నరవరులకు యగతులు దొలగన్
చిగురింపగ మనమునిశను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 4

తగువేషములేయగ తీ
యగ మీసము సత్వరముగ యాదృచ్ఛికమున్
మొగమూటమేల తానిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 5

గంగను జుట్టరె గందపు
పెగతో గందములు తొలగజేయగ నింకన్
రోగముల బాపరాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 6

అంగనయైనను ఏమయ
కొంగును బట్టుక తిరుగరె కూరిమిభక్తిన్
కంగులపున నిమతగనిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 7

బిగులవెతెంకలు మెండుగ
అగరులు యెగయవె మొగదలయచ్చెరువొందన్
వగపులు మాయమవగనిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 8

గగనము కాదటో కోరగ
క్రాగరె జూడరె నిజముగ కోర్కెలు దీరన్
త్రాగగ తీర్థము బిగువుగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 9

లోగడచేసిన తప్పుల
సాగిలముగపడగ మరిక శరణము నీయున్
అగుపును దప్పగ తృటితో
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 10

చెంగలువ బూలతో నిం
పుగ బూజించియు మరికను పొంగలిబెట్టన్
చెంగుల నడుమను నెగురుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 11

గంగికి బెట్టిన గాజుల
మ్రోగును శక్తిని చిరుతలు పొందుగ పాడన్
యిగురింపగ మనము నికను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 12

నాగలిదున్నగ రెడ్డియు
వగచుచు నగుపడదె పావ వద్దున యింకన్
ఎగవెత్తగ " గంగ " యంచును
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 13

ఛంగున ఎగురుగ పల్లెసు
గంగయు బెద్దగ బెరుగదె గమయుచు చింతన్ (పరిమళించుచు)
అంగన లమోఘమనగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 14

బెంగయు నెందులకింకను
గంగను నీదాపునుండ గతులను మారన్
సద్గతినొందగ నింకను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 15

రంగరు తల్లిగ నికను బె
రుగదె " యటవిలాల " యందు రాగము తోడన్
సంగతము లింక దెల్పగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 16

గంగమ గుణగణములు తెలి
యగ విచిత్రముగను జెప్పయాసముతోడన్
వగయును మధురము గాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 17

గంగమ యందము తెలియగ
ఆగిలాలను చేరదునిక యంమృత తోడన్
షగవక పాశెపు గొలుసు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 18

వేగము కోరదె తనకి
యొగనిక క్రిష్ణనగరపు యధిపతి ఖుగులన్
లొంగదె పెదిరెడ్డి యునిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 19

గంగయు నగుబడగ రాకా
సిగవిక కత్తితో నతుకగ జొచ్చిన తుటుమన్
దాగగ తిరుపతి పురమున
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 20

దొంగగ దాగదె క్రైకా
యిగుడిసె యందున మరుగున యిరుతుగ నింకన్
గగనమె గానక యుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 21

అగడు పడిన పాళ్యడును
క్రుంగియు మనమున జొరబాడె కర్ణపు పీఠిన్
గంగయు తిరుగగ వెదకుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 22

గంగయు వెదుకదె తిరపతి
నగరము నందున మరిమరి నరుకగ వానిన్
అంగన మోహితుడగుటను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 23

గగనమె గంగకు బిడ్డగ
దాగు కొనగ ముండ్ల పొదల దట్టియుడు యింకన్
తెగడగె యేడవరోజున
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 24

దాగదె తాతయ గుంటను
వేగమె మూర్లపొదలందు విధివంచితుడై
ఉగ్రమున జంపగ వానిని
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 25

గంగయు గుండెను జీల్చియు
త్రాగగ రక్తము మరిమరి తనివియు దీఱన్
ఊగగ రౌద్రముతో నిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 26

జోగర మండియు శాంతిం
వగ జాతరసేయ రెవిక వండగవోలెన్
తెగ మెచ్చగ గంగమ్మయు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 27

గంగను దేవతగా ఎరు
గగ నిక జాతర వరుసగ గ్రామము లందున్
జగతిని గూడను సేయగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 28

గంగను కోరరె యట నిలు
వగ తాతయ్యగుంట నొద్దు వసరుగ నింకన్
జగతిని మహిమలు విరియగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 29

గంగకు బలులను శాంతిం
పగ నిచ్చి గుడినిక గట్టి భక్తులు గోరన్
నగరప్రజ నాంటి బిల్వగ
గంగను గురుతుగ గొలువుమ గమ్యము జేరన్ 30

గంగమ సోదరి మణులను పెద
గంగమ ముత్తెల పోలేరి ఘనముగ యుంకి
శి నేర్చ్చు కాళ్ళన్ కాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 31

త్రాగగ రక్తము వాడును
జగతియు కంపింప నింక చోద్యము లేకన్
జగతి కట్టడి సేయగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 32

తెగ జూడగ పొలిమేరల
గంగమసోదరి మణులను గతవైనమునన్
యెగరుతో బూజలు సల్పగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 33

త్రాగగ రక్తము యుంకను
ముగియగ వాల నరబలు మంత్రతతితో నా
పగ యన్నమయ్య పూనగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 34

తెగువున నాతడు బదులీ
యగ జంతువుల నొప్పయవ్వార మికన్
యాగగ య:తటితో నిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 35

గంగయు కాపాడెదె నిక
నగరింపు ప్రజలను మిగులఁగ నమ్మిక తోడన్
జగతిని కీర్తింప బడగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 36

మోగగ చాటును మొదటిదగు
మంగళవారపు దినమున " మే " నెల యందున్
మంగళ మెగ నవిలాలకు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 37

పొగడగ తరమెర చాటును
నగుపడ కుంకుమ పసుపుతొ యతసర చీరల్
మంగళ తూర్యమె మ్రోగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 38

జగరములతో జాతర జ
రుగు యేడు దినముల సంబరములును మహనా
ట్మంగళవారము పురమున
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 39

గంగమ జాతర రోజుల
పగలే వేషములు వేయు ' పగలును ' తొలగున్
శగలే శమించి పొవగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 40

గంగకు సంబరములచే
యగ సందడి కలుగదె నిక యాదృచ్ఛికమున్
మంగళము బలుక గంగకు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 41

మగవారిక మారరె పై
రాగులగను మొదటిరోజు రంగులతోడన్
గంగయు తృప్తియు జెందగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 42

నగలతో కుంకుమతో నిక
వగలను బోవరె మగలును వగవక యింకన్
యుగులగ వీగలను మరియిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 43

నగరిని తిరుగరె కాయ్యతో
వగవక మగువలకు రెండవదినమున నికన్
వగలును పగలును బోవగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 44

ఈగల బోలెను వ్రాలరె
బొగ్గును పూసుక తిరుగరె బిలబిల మంచున్
మిగులగ వేడను జుట్టియు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 45

తెగదిట్ట బూతు వేదము
బగ భావింపగ నిక గంగ లీలల్ జూపన్
(వళపర్చుకొాసు) లోగానగ జనుల నింకను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 46

నాల్గవరోజున వరి వే
యగ వలువేషముల నికను యత్నముతోడన్
గంగయు మెచ్చగ గొప్పగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 47

ఆగియు ఐదవ రోజున
గంగకు వేషమున నుండి గంతులు వేయన్
గంగకు బల్కగ నింపుగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 48

లాగియు జుత్తు ముడి బిగిం
చగ సున్నపు కుండ నందు చోద్యము లేకం
డగ మూడు కుండలుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 49

ప్రోగగ నత్సరములు యను
వుగ నిక వేయగ దరువును వుత్సాహమునన్
యడ్డులు తడబడు చుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 50

అగరులు వేదలగ నిక గుబు
రుగ మరువగలమె నిజముగ రూపమునింకన్
గగనమె కనుగొన యమ్మను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 51

ఆగలుగె కుండలు మాడును
తగులగ నొకవానిపై యదనముగ నుంచన్
లగువున కిలకిల యాడగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 52

మ్రోగగ వలకలుమరి తిరు
గగ సప్పరములు పురమున గలగల కనుచున్
తాగములో బూతు బలుక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 53

గగనము నుండియు నిశలా
లగ పూలను జలజల లెక్కలయు తేగన్
ఆగుగాక యంచు బల్కగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 54

మంగళ వాద్యములిక మ్రో
గగ గింగురు మంచును నిక గలగల యంచున్
గంగమ దీవించ జనులను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 55

మంగళములునిక దెల్పుము
గంగకు మంచి నొనగూర్చ గగ్గుయులేకన్
పొంగలి బెట్టుచు నింకను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 56

మంగళవారము నాడును
మంగళములు జరుగ నింక మలినము వీడే
మంగళ తూర్యము మ్రోగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 57

గంగయె గంగియు గాగను
గంగియె గంగయ యగుటను గమ్యము గాదే
గంగయె తల్లిగ నిలువగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 58

నగుమోముతో గనుపింపగ
పొంగుచు నాట్యము జరుపరె పొలిమెర నుడిన్
గంగయు తలపున రాగా
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 59

అగుపించదెనిక గంగయు
యగుపిపింపదె మరి మనమున యనురాగముతోడన్
యగుపించగ నగుమోముతో
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 60

మంగళపేరుర కొలువగ
గంగను మంగళము గాదె 'గంగ'తో కొలువన్
మంగళము దెలుప గంగయు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 61

మంగళగాత్రియు నామెయె
మంగళ సూచకము యామె మంగళమనగా
మంగళము దెల్పుదల్లికి
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 62

గగనము నంటగ సందడి
గగనమున కెగయ మిగులంగ గాలిపటములున్
గగనమెగయ సంబరములు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 63

వగులగ పలకలు నిక యరు
వగ అమ్మాయనుచు యరచి వనరుగ బిలువన్
గంగయు కదలచు రాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 64

నకరపు సందడియె గయగ
గగనము పులకింపదె నిక గలగల మనుచున్
గగనము మెరయగ ఉరుముల
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 65

రాగితో వంబలి నిడ బై
రాగుల త్రాగగ హృదువుగ రంగుల తోడన్
రాగులె ఋచిచేయగ నిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 66

ఉగ్గును బోయగ నమ్మయె
అగ్గియు గూడ నిక నామెయె యచ్చెరుపొందన్
నిగ్గును దేల్చగ దుష్టుల
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 67

ఇగురింపగ మా మానసములు
చిగురింపగ నిక చెలిమియు చింతయు దీఱన్
గంగను తిన్నగ మ్రొక్కుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 68

బొంగరములవలె తిరుగగ
గింగురసప్పరముల నిడికొని గిరగిర మనుచున్
బంగున పలకలు మ్రోగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 69

రంగుల తోడను సత్రముగా
గింగురు మంచును తిరుగగ గిడికొన వేళా
బిగువును వదలియు గదలుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 70

గంగమ్మ యంచును తలచుచు
గంగయనుచును పిలువగ గలవరమేలా
గంగమ యంచును యరచుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 71

బంగరు తల్లియు నామెయె
కొంగున బంగరును యామె కోరిన దీయన్
తంగున గంటలు మ్రోగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 72

గంగను యడుగగ నింకను
గంగయు యీయదె మిగులగ కోరిన వరముల్
గంగమ తలపున యుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 73

గంగమ సత్యము దెలియగ
మంగళ శుక్రవారముబేగ మహిమలు దెలియన్
పొంగలి పంచుచు పొగడుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 74

గంగమ శక్తియు దెలియగ
గంగను యికనైన తలప ఘోరములాపున్
వెంగలి గను యుండ తగువె
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 75

పోగుగ చవ్వాకున్ యుం
ఖగ పొందుగ చల్దివెట్ట శక్తి కొలందియున్
పొంగలి బెట్టుచు గోముగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 76

గంగను గుడినిక నడుగిడ
గంగను గొప్పగ గనగను ఘనతయు కలుగున్
గంగను మేల్కొల్పుచు నితను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 77

గంగను శరణము యడుగగ
గంగయు శరణము నీయదె గతమును మారన్
వగవక శరణము వేడుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 78

పొంగలి బెట్టగ నింకను
పొంగుచు మిగులాక వరముల పొందగ వేగన్
కొంగున బంగరు గూడగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 79

గంగను నభిషేకము సే
యగ నూటొక బిందెతోడ యరవురకేకన్
ఓగుయు తొలగదె తిన్నగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 80

మంగళవారము పొలతి
షేకము సేయన్ మిగులగ సేగియు దొలగున్
గంగయు గోముగ నిమరగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 81

మంగళ హారతు లీయగ
మంగళములు కలుగజేసె మతిమరి మిగులన్
మంగళ గౌరియు గాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 82

ముంగిట యింటింటను యా
రి గ యంబలికను బోయ తృపితియు దీరన్
మ్రింగుచు గుటకలు వేయుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 83

గంగయె యింటింటను నొక
గంగమగ నిలచి వెలసియు గంతియు బోయన్
గర్గోన శక్యమె గంగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 84.

గంగను జూడగ నికమం
చుగ రేశాలు గనరె దుష్టము దొలగన్
వేగమె చేతుచు గంగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 85

ఇగచేయగ బొమ్మను నిలు
వగ శిలవలె నిక మహిమలు వ్యాపించగాన్
నగువడదె పులివలె నింకను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 86

ధగధగ మెరయుచు నిక యా
రేగి ప్రసాదమిడ భక్తి రెపరెప లాడన్
ఊగగ పేరంటాళ్ళను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 87

చెంగున ఎగురుచు చెంపను
రంగున గొట్టగ వగులగ దాలుచు వింకన్
మెగబడ మృత్తిక కైవిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 88

అగువుగ విమ్మల దండల
పగడపు దండల వరెవిడి ప్రార్థన చేయన్
అందగ యుండగ మెండుగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 89

నాల్గు పొలిమేరలందున
నగ్గారి సుఖుము గనగను నడయాడగనికన్
నగరికి రక్షగ యుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 90

బిగువుగ వేవపు యూకుల
ము గట్టి మొక్కులను దీర్చి నుతులను జదువన్
గంగయు పోసముసుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 91

గంగయె ధర్మము సత్యము
గంగయె శాంతియును ప్రీతి గతియునుగాగన్
గంగయె నిత్యంబగుటను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 92

గంగకు కుంభము నిండుగ
తెగబోయగ కుంభవృష్టి బెంపుగ కురియన్
నింగియు పెళ ప్లన యురుముగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 93

రంగులతో సప్రముల చే
యగ గోపురములు గనికను యత్నముతోటిన్
ఖంగున డప్పులు మ్రోగగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 94

మొగలిరేకుల వలె నిగ
నిగ మను ముత్యాల చిలకల నీటు రథమున్
భాగ్య నగు ల జేయగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 95

గంగకు పంచామృత యభి
షేకము చేయగ మరియిక వేవయు బెరుగున్
గంగయు శాంతింపగ నిక
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 96

గంగకు బెట్టిన నలుపు ము
ంగుయు చిరుతలకు తోడుగ రహటులు దోలగున్
గంగమశక్తియు దెలియగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 97

పగులగ టెంకాయలు మిగు
లుగ యదురుగ నికను మనసులు విరియగ నికన్
గంగయు దీవెనలీయగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 98

పొంగలి బెట్టగ అమ్మకు
పొంగలి పంచగ మిగులగ పదిమందికికన్
పొంగలి గోరగ గంగయు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 99

గంగను శరణము వేడర
గంగయు నీయదె శరణము గతులను మారన్
గంగయె శరణము గాగను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 100

గంగయె తాపసి రూప వ
తిగ నిలువగ పురమునందు తిష్టయు వేయన్
గంగను మరువక దలచుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 101

జాగరణ చేయుచింకను
జాగరణయె జాతగాగ ఝామురి వరకున్
గ-గమ జాతర జ-గగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 102

గ గమ యంమను పిల్లలు
గంగను చుట్టియు నెగురగ గలగల మంచున్
గంగయు గోముగ నిమరగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 103

గంగమ పంతము యేలనె
సద్గతిగలిగించ మాకుసాయము నీవే
వేర్గతియు లేదంచును
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 104

మ్రోగగ గుడిలో గంటలు
మ్రోగగ డప్పులు మతిమడి మోతల తోడన్
మంగళహారతి నిచ్చుచు
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 105

అగుపడవే కథలందున
యగుపడవే హృదయ మందు యాశ్చర్యమునన్
యగుపడగను నింటింటను
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 106

గంగను నమ్మర నింకను
గంగమచరితము చదువక కొరతలు దీరన్
గంగయు హృదిలో మెదలగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 107

గంగమ్మ చరితము నిక వ్రా
యగ నెంచియు వ్రాసితి గద యణుకువతోడన్
గంగయె తోడును యుండగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 108

గంగమ యేమ చినమకైన
నగరపు వాసుడను శాస్త్రి నామము తోడన్
చిగురింపగ నిక యాటనిట
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 109

బిగువున వ్రాయగ నెంచగ
గంగయు చేదోడు రాదె గణిబిజి తొలగిం
పగ నిక రచనము నందున
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 110

గంగమ చి॥ల॥సౌ॥ శాస్త్రిని
నగరము చినమకైన గాదె నిరతముగ నికన్
తగురీతిన దీవింపగ
గంగను గురుతుగ గొలువుము గమ్యము జేరన్ 111



# గంగమ పంచరత్నములు:

గంగమ మొగము జూడగ
గంగమ పాదములదాక కార్యము గూడు
గంగమ రూపము దలచుచు

గంగమ ముక్కెరయదిగో
గంగమ హారములు గనగ కరుణయు పొంగున
గంగమ హృదినిక దాకగ గం॥

గంగమ జొడ్డము పుందుగ
గంగమ జాడుమ తదుపరి గతులును మారవ్
గంగతో నభిషేకించుము గం॥

గంగకు బెట్టిరె చీరెలు
గంగకు పూయగ పసుపుమ గాజాలు విలుపన్
గంగకు కుంకుమ బెట్టుచు గం॥

గంగకు బెట్టగ సారెను
గల్గవె మేళ్ళమ మనకును కలికాలమువన్
మంగళహారతి నిచ్చుచు గం॥

శతకమంజరి మొదటిభాగము సమాప్తం

---

ముద్రణ :- మల్లేశ్వరి ప్రెస్, బొవల్ల.